తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

ఆగస్టు 2016 వెల రూ.5/-





కృష్ణ పుష్కరం 2016

(ఆగస్టు 12 నుండి 23 వరకు)

నీవారిలో మునుగు మావారి కరుణింప
దేవతలు నీ మహిమ కైవార మొనరింప
గురుడు కన్యారాశి కరుదెంచు శుభవేళ
విరబూచునంట పుష్కరము నీ కెరటాల

12-08-2016

వరలక్ష్మీ వ్రతం



సర్వమంగళసంపూర్ణా సర్వైశ్వర్యసమన్వితా ।
ఆద్యాదిశ్రీ ర్మహాలక్ష్మీ స్త్వత్కలా మయి తిష్ఠతు ।।

# ఉగ్గు వెట్టరే వోయమ్మా...!

ఉగ్గు వెట్టరే వోయమ్మా చె -
య్యొగ్గీనిదె శిశువోయమ్మా

కడుపులోని లోకమ్ములు గదలీ -
నొడలూఁచకురే వోయమ్మా
తొడికెడి సరుగనఁ దొలఁగఁదీయరే
వుడికెడి పాలివి వోయమ్మా

చప్పలు వట్టుక సన్నపుబాలుని -
నుప్పరమెత్తకురో యమ్మా
అప్పడె సకలము నదిమీ నోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా

తొయ్యలులిటు చేతుల నలఁగించక
వుయ్యల నిడరే వోయమ్మా
కొయ్యమాటలను కొండల తిమ్మని -
నొయ్యన తిట్టకురోరమ్మా (సంపుటం 5 - సంకీర్తన 97)

"ఓ అమ్మలారా! బాలకృష్ణునికి ఉగ్గు పెట్టండి - అలా అని మీ ఇష్టానుసారంగా ఉగ్గుపెట్టవద్దు. ఈ బాలుడు సామాన్యుడు గాడు, జాగ్రత్తలు తీసుకోండి! ఉగ్గుపెట్టిన తర్వాత ఈ చిన్నిబాలుణ్ణి ఉవ్వెత్తుగా ఆకసానికి ఎగురవేయకండి. కడుపులోని లోకాలన్నీ కదలిపోతాయి. వేడిపాలు, త్రాగించకండి. చిన్నిశిశువు తట్టు కోలేడు! ముద్దుగా ఉన్నాడని అమ్మలారా! మీ మీ చేతుల్లో నలిగి పోకుండా, ఇతణ్ణి అలసటకు గురి చేయక ఉయ్యాలలో పరుండ బెట్టండి. కొండలతిమ్మడైన ఈ బాలుణ్ణి కసరకుండా ఉయ్యాలలో పరుండబెట్టి ఊపండమ్మా" - అని యశోదగా తానే మారి, అన్నమయ్య బాలశ్రీకృష్ణుణ్ణి ఈ సంకీర్తనలో లాలించాడు.

ఆగష్టు 25 శ్రీ కృష్ణాష్టమి సందర్భంగా.....



# కృష్ణా పుష్కర మహోత్సవ శుభాకాంక్షలు

పవిత్ర పుష్కరిణి కృష్ణవేణి తోయామృతధార
అందరికీ సద్గుణ సిద్ధిని కలుగజేయాలని,
సర్వత్రా సంతోషాల వెల్లువ ప్రసరించాలని ఆకాంక్షిస్తూ,
కృష్ణవేణీ పుష్కరాల శుభసందర్భంలో
పాఠకమహాశయులకు, రచయితలకు,
చందాదారులకు, ఏజెంట్లకు,
సర్వభక్తలోకానికీ..... శుభకామనలు - ప్రధాన సంపాదకుడు



## 2016 సెప్టెంబరు నెల పర్వదినాలు

**03** బలరామజయంతి

**04** శ్రీవరాహజయంతి

**05** వినాయకచవితి

**09 నుండి 12 వరకు**
జమ్మలమడుగు శ్రీదేవీ, భూదేవీ సమేత శ్రీనారాపుర వేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు

**11 నుండి 14 వరకు**
తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివార్ల పవిత్రోత్సవాలు

**12 నుండి 15 వరకు**
ఋషికేష్ శ్రీ పార్వతీదేవీ సమేత శ్రీ చంద్రమౌళీశ్వరస్వామి వారి పవిత్రోత్సవాలు

**13 నుండి 16 వరకు**
దేవునికడప శ్రీలక్ష్మీవేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు

**13** వామనజయంతి

**14 నుండి 17 వరకు**
తిరుచానూరు శ్రీపద్మావతీ అమ్మవారి పవిత్రోత్సవాలు

**15 నుండి 16 వరకు**
నారాయణవనం శ్రీకల్యాణ వేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు

**15** అనంతపద్మనాభవ్రతం

**18** ఉండ్రాళ్ల తద్దె

**26 నుండి 27 వరకు**
అప్పలాయిగుంట శ్రీప్రసన్నవేంకటేశ్వరస్వామి వారి పవిత్రోత్సవాలు

**30** మహాలయ అమావాస్య

## ప్రయోజనం

### ప్రతి ఉపాధ్యాయుడూ....

జూలైనెల 'సప్తగిరి' గురువులపై ప్రత్యేక సంచికగా తీసుకు రావడం చాలాబాగుంది. గురువుల గౌరవాన్ని, శిష్యవాత్సల్యాన్ని అద్దంపట్టేలా ఈ సంచిక వెలువడింది. ప్రతి ఉపాధ్యాయుడూ జీవితాంతం తన దగ్గర దాచుకోదగ్గ సంచిక ఇది. గురువులు తమ గురుతరమైన బాధ్యతను చిత్తశుద్ధితో నిర్వహిస్తే ఎలా శిష్యుల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోతారో ఈ సంచిక తెలియ జేసింది. అటు ఉపాధ్యాయులలో, ఇటు శిష్యులలో స్ఫూర్తిని కలి గించే సంచిక ఇది. *- మోదుగుల రవికృష్ణ, గుంటూరు.*

### చాలా సప్రమాణంగా...

జూలై నెల 'సప్తగిరి'లో 'పచ్చతోరణం' శీర్షికన మీరు ప్రచురిం చిన 'వందేగురుపరంపరామ్' వ్యాసం అత్యద్భుతం. నేను నా అధ్యాపక జీవితంలో ఎన్నోసార్లు 'ఉదంకోపాఖ్యానం' పాఠం చెప్పి ఉంటాను. అయినా, ఈ వ్యాసంలో మీరు ఈ ఉపాఖ్యానానికి జోడించిన వ్యాఖ్యానం చాలా సప్రమాణంగా ఉంది. ఇటీవలి కాలంలో నేను ఇంతగొప్ప వ్యాసం చదువలేదు. రచయితకు, ప్రచురించిన ప్రధాన సంపాదకులకు ధన్యవాదాలు. *- ఎస్.రాజేశ్వరశర్మ, అనంతపురం.*

### ప్రత్యేక కృతజ్ఞతలు

ఈ పుష్కర ప్రత్యేక సంచిక ఇంత పటిష్టంగా రావడానికి సహ కరించిన మాన్యులు శ్రీ లంకాసూర్యనారాయణ, అన్నమయ్య గ్రంథా లయం(గుంటూరు), శ్రీ బాలి, ప్రముఖ చిత్రకారులు (హైదరాబాదు), ఆచార్య వెలిదండ నిత్యానందరావు (హైదరాబాదు), శ్రీపోలవరపు కోటేశ్వరరావు(విజయవాడ) గార్లకు ప్రత్యేక కృతజ్ఞతలు.

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 47 ఆగష్టు, 2016 సంచిక : 03



వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి ॥

**గౌరవ సంపాదకుడు**
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు.

**పర్యవేక్షకుడు**
శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్. (విశ్రాంత),
విశేషాధికారి,
ప్రాజెక్టులు, తి.తి.దే.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**(ఎఫ్.ఏ.సి.),
**సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ

**ఉపసంపాదకుడు**
డా॥ కంపల్లె రవిచంద్రన్

**ముద్రాపకురాలు**
శ్రీమతి ఎమ్.గౌతమి, ఎం.బి.ఏ.,
ఉపకార్యనిర్వహణాధికారి(ప్రచురణలు & ముద్రణాలయం),
తి.తి.దే., తిరుపతి

**వర్ణ చిత్ర పుటలు**
శ్రీ పి.శివప్రసాద్

**రూపకల్పన**
శ్రీ బి.గురుకుమార్ రెడ్డి

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

## ఈ నెలలో....



ముఖచిత్రం : కృష్ణవేణి నమస్తుభ్యం!
వెనుకచిత్రం : అన్నియునీవే హరిపుండరీకాక్ష!



24 గంటలు పనిచేసే తి.తి.దే. కాల్‌సెంటర్ ఫోన్ నెం.
0877 - 2277777 / 2233333



స్థలాభావం వల్ల 'తిరుమల విశిష్టత', 'శ్రీజనాబాయి' ధారావాహికలు ప్రచురించలేకపోతున్నాం. పాఠకులు గమనించగలరు



# పావన కృష్ణవేణి !

నమామి సుకృతశ్రేణీం కృష్ణవేణీం తరంగిణీమ్
యద్వీక్షణం కోటిజన్మకృతదుష్కర్మశిక్షణమ్ ।

ఈ అనంత ప్రాణికోటికి నీరు ప్రాణాధారం. ఏ నాగరకత వృద్ధిచెందినా – ఏ హరితవిప్లవం కొనలు సాగినా – ఏ సామ్రాజ్యాలు రూపుదిద్దుకున్నా నదీతీరాలలోనే జరిగాయి. మానవజీవితం నదీమతల్లికదలికలతో ముడి వేసుకున్నదనడంలో సందేహంలేదు.

ప్రాణిసంతతికి తీయని నీరందించి, ఆహారాన్ని సమకూర్చి వాటిజీవనవిధానానికి పాదులు తీసినవే నదులు. జీవనదీ ప్రవాహంవల్లే విశ్వసృష్టి నిరంతరాయంగా సాగుతున్నదనడం సత్యదూరం కాదు. మన హైందవదేశంలో గంగా, యమున, బ్రహ్మపుత్ర, గోదావరి, కృష్ణ, కావేరి వంటి జీవనదులు వేదనాదంగా, ప్రణవరూపంగా ప్రవహిస్తూ భూమిని సస్యశ్యామలం చేస్తున్నాయి.

దయాసింధువైన భగవంతుని కరుణారసప్రవాహాలే నదులు. భూమిపై తాను సృజించిన సర్వభూత ధాత్రి ప్రాణధారణ కోసం, భగవంతుడు, తన కరుణనుఈవిధంగా, నిత్యం ప్రవహింప చేస్తున్నాడు. ఆ నదీజలస్పర్శతో పుడమితల్లి పులకించి – పరవశించి, పచ్చని పైరుపంటలతో కళకళలాడుతుంది.

ఇంత గొప్పనదీమతల్లులను దేవతలుగా ఆరాధించే సంస్కృతి మనది. పరమేశ్వరుడు పరోక్షంగా లేడనీ, మనచుట్టూ ఉన్న ప్రకృతిలోనే ఆయన తన కరుణామయశక్తిని ప్రసరింపజేస్తున్నాడనీ పరిశీలించి, ప్రత్యక్షం చేసుకున్న భవ్యసంస్కృతి మనది.

ప్రతిహైందవుడు ఏ అనుష్ఠానం చేసినప్పటికీ, కలశంలో నీటిని స్వీకరించి, నదులన్నిటినీ స్మరించి, ఆ నీటిలో ఆయా నదీమతల్లులశక్తి విలీనమైనట్లుగా భావించి, ఆ నీటితోనే దేవకార్యాలను చేస్తాడు.

గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేర్యా జలేఽస్మిన్ సన్నిధింకురు ॥

– అని పఠించి, తన సమీపంలో ఉన్న జలంలో సర్వనదుల సాన్నిధ్యాన్ని అనుభవిస్తాం. పురాణాలలో నదులపుట్టుకలకు సంబంధించి చక్కని గాథలున్నాయి. నదీతీరాలలో సుప్రసిద్ధక్షేత్రాలు విలసిల్లాయి. నదులు ఉద్భవించిన తావునుండి, సాగరంలో సంగమించేస్థలంవరకు అడుగడుగునా పుణ్యక్షేత్రాలే. ఆసేతుహిమాచలం ఈ నదుల ద్వారానే సమైక్యతాభావం వర్ధిల్లుతోంది.

నదుల పూజాపరంపరలో అత్యంతపవిత్రమైన కార్యం పుష్కరస్నానం. పన్నెండేళ్లకొకసారి చేసే పుష్కరస్నానం, శారీరక, మానసికక్లేశాలను తొలగించి ఆత్మకు, శరీరానికి స్వస్థత చేకూరుస్తుందని మనవారివిశ్వాసం.

కృష్ణవేణీనదీమతల్లికి, బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించినప్పుడు పుష్కరం వస్తుంది. ఈ దుర్ముఖవత్సర పుణ్యకాలంలో మన జీవనగంగ – పావనకృష్ణవేణీపుష్కరం జనజీవనచైతన్యాన్ని మరోసారి పల్లవింపజేయబోతోంది. భిన్నభిన్న భాషా సంస్కృతులను, కులమతవర్గవర్ణవిభేదాలకు అతీతంగా భావైక్యతరంగాలలో బంధించి, "భిన్నత్వంలో ఏకత్వాన్ని" పట్టి చూపేది పుష్కరం. పుష్కరతీర్థసంగమంతో – మనభాషా సంస్కృతీ సంప్రదాయాలు సమైక్యజాతీయతకు పునరంకితమవబోతున్నాయి.

సృష్టికి మూలమైన ప్రకృతిని ఆరాధిస్తూ, ప్రకృతి, వికృతి కాకుండా మనిషి ప్రకృతిధర్మాన్ని నెరవేరుస్తున్నంతకాలం, పంచభూతాలు మనిషిని చల్లగా చూస్తాయి. ఇదే జీవనరహస్యం. ఆధ్యాత్మికమర్మం, ధర్మం!

శుభం భూయాత్!

ఏడాదికో...

నదికి పుష్కరం.

ఆ సమయంలో....

బృహస్పతి గ్రహప్రభావం,
పవిత్రపుష్కరుని దివ్యత్వం
ఆయా నదులలో ప్రవేశిస్తుందని మనశాస్త్రాలమాట.

ఏ రాజకీయసిద్ధాంతాలు, సంఘసేవోద్యమాలు
చేయలేని పనిని మన సనాతనసంస్కృతి సాధిస్తోంది.

కృష్ణమ్మకు పుష్కరాలశోభ వచ్చింది.

దేశంనలుమూలలనుంచీ లక్షలాదిభారతీయులు శ్రద్ధావిశ్వాసాలతో కృష్ణాజలాల్ని ఆరాధించారు.

ఈ నేపథ్యంలో సరియైనరీతిలో పరిశీలిస్తే మన పూర్వికుల ఔన్నత్యం అవగతమవుతుంది.

పరమేశ్వరుడు ఎక్కడో అతీతంగా లేడనీ, ప్రకృతిలో ప్రత్యణువులో ప్రకాశిస్తున్నాడనీ, ఆ సత్యాన్ని ఆవిష్కరించుకొని, నిరంతరం ఆనందంగా, ప్రేమగా, స్వేచ్ఛగా, స్వచ్ఛంగా బతకమని బోధించడమే సనాతనమతసారం.

ఏడాదికో నదికి పుష్కరం. ఆ సమయంలో బృహస్పతి గ్రహప్రభావం, పవిత్రపుష్కరుని దివ్యత్వం ఆయా నదులలో ప్రవేశిస్తుందని మనశాస్త్రాలమాట. ఏ రాజకీయ సిద్ధాంతాలు, సంఘసేవోద్యమాలు చేయలేని పనిని మన సనాతనసంస్కృతి సాధిస్తోంది.

"ఈ దేశమంతా నాది" అనే భావన సనాతనధర్మంవల్ల కలుగుతోంది. దేశమంతా ప్రవహించే నదులనూ, పుణ్యతీర్థాలని స్మరించుకుంటాం. పుష్కరాలు, కుంభమేళాలు – వంటి పుణ్యకాలాల్లో, పండుగల్లో దేశమంతా ఒక నదీతీరానికో, ఒక దివ్య క్షేత్రానికో చేరి, జనశక్తిని ప్రకటిస్తుంది. ఈ సమాగమంలో భాషల ఎల్లలు, ప్రాంతాల హద్దులు పనిచేయవు. పైగా – భిన్న ప్రాంతాల సంస్కృతుల పరస్పరావగాహన, సామరస్యస్ఫురణ వెల్లివిరుస్తుంది.

అన్నిభాగాలలోని కళలను, ఆచారవ్యవహారాలను ఒకరికొకరు అందిపుచ్చుకుంటారు. తమపూర్వికులను తలంచుకొని, వివిధధార్మికకర్మలను ఆచరించడంకూడా మనిషికి పూర్వతరాలపట్ల ఉన్న కృతజ్ఞతనూ, ధార్మికతనూ స్ఫురింపజేస్తుంది. ఈ విధంగా జాతీయసమైక్యతను సాధించడంలో సనాతనధర్మం బలవత్తరపాత్రను పోషిస్తోంది.

ఈ దేశంలోని నదులన్నింటికి పురాణకథలున్నాయి. వాటితో ఈ దేశవాసులమనసులు మధురానుబంధంతో పెనవేసుకుపోయాయి. ఇవి కేవలం నీటిప్రవాహాలు కావు. జీవ స్వరూపాలు. వీటికి ఆత్మ ఉంది. అది మనఆత్మలను పలకరిస్తుంది. మనపలకరింతలకు పులకరిస్తుంది. మనల్ని పోషిస్తుంది. లాలిస్తుంది. ఈ ప్రాణబంధాన్ని మరింత అవగాహన చేసుకొనే ధార్మికతను ప్రబోధిస్తే, ఈ మాతృమూర్తులపట్ల ప్రజలబాధ్యతను తెలియజేసినవాళ్లమవుతాం.

# నదీమతల్లికి... నమస్కృతాలు

బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ



దేవతామూర్తుల్నీ, అమ్మనీ ఎంతప్రేమగా, భద్రంగా, పవిత్రంగా చూడాలో అలాగే– ఈ నదుల పట్ల బాధ్యతతో, గౌరవంతో, పవిత్రతతో ప్రవర్తించాలనే స్పృహ ప్రతివారికీ కలగాలి. కలిగించాలి. అప్పుడే నిజమైన పుష్కర స్నానఫలం లభిస్తుంది. ఈ దేశపు అత్యధిక ప్రజావాహిని, ఈ జలవాహినులలో కలసి జలకమాడి, పూజించే ఈ పర్వాలను మతపరమైన క్రియలుగా భావించడం పరమమూర్ఖత్వం.

ఈ దేశప్రజలు అనాదిగా ఈ నేలతో, ఈ నీటితో పెట్టుకున్న సనాతనబాంధవ్యానికి చిహ్నాలివి. అంటే– ఇవి ఈ దేశపు మట్టిలో పుట్టినసంస్కృతికి ఆలవాలాలు. సంస్కారానికి సంకేతాలు. ఈ అవగాహన పాలకులకూ, ప్రజలకూ అవసరం. ప్రజలంతా పాల్గొనే ఈ చోట, ఇంతటి అవగాహన, విశాల దృక్పథం కలిగించడంలో వివేకవంతులు తగిన బాధ్యత వహించాలి. ప్రతినదిఒడ్డునా మహాసామ్రాజ్యాలు, ఎన్నో నాగరకతలు, కళాసంస్కృతులు, విలసిల్లిన ఘనచరిత్రలున్నాయి.

ఆ చరిత్రలు మిగిల్చిన అద్భుతవారసత్వసంపదలున్నాయి. వాటిల్ని స్మరించడానికి, కరదీపికలుగా గ్రహించడానికి, తరువాతి తరాలకు అందించడానికి ఇంతచక్కని పర్వవేళలను ఏర్పరచారేమో మహర్షులు! ఒక్క మంచిపనితో, వేలాది సత్ఫ్రయోజనాలను సాధింపజేసే ఇలాంటి ఉత్సవాలు, వేడుకలు ప్రజలందరిహృదయాలను ఒకే సూత్రంతో ఏకీకృతం చేసే అద్భుత సాధనాలు–పుష్కరాలు.

ఈ దేశపునదులన్నీ పావనజలాలతో పుష్కలంగా ప్రవహించాలని, నేలతల్లి సస్యశ్యామలం కావాలని పుష్కర దేవత లందరినీ ప్రార్థిద్దాం.



## నదీస్నానం

భారతదేశం ఎన్నో పుణ్యనదీనదాలకు నిలయం. దేవతలుకూడా భారతభూమిపై సంచరించాలనీ, ఇక్కడి పుణ్య నదీనదతీర్థాలలో స్నానం చెయ్యాలనీ, ఇక్కడ విహరించాలనీ కోరుతుంటారు. దేవభూములవాళ్లే మనభూమిపై అంత పవిత్ర భావం కల్గి ఉన్నారంటే– ఇక్కడే పుట్టి, పెరిగి, జీవిస్తున్న మనం ఎంత అదృష్టవంతులమో, పుణ్యాత్ములమో కదా!

నదీనదతీర్థస్నానాలు – భక్తిశ్రద్ధలతో, విశ్వాసంతో, దైవీభావనతో, ఆధ్యాత్మికహృదయంతో చేస్తే – అవి మనకు అనంతమైన పుణ్యాన్నీ, ఆత్మతత్త్వజ్ఞానాన్నీ ప్రసాదించి, పునర్జన్మ లేకుండా చేస్తాయి.

భారతభూమి విశ్వవిఖ్యాతి పొందడానికి ముఖ్యకారణం– ఇక్కడుండే పవిత్రపర్వతాలూ, పుణ్యక్షేత్రాలూ, పుణ్యనదీనదాలూ, పుణ్యతీర్థాలే!

గంగాదిపుణ్యనదీతీరాల్లో మహర్షులూ, చక్రవర్తులూ ఎన్నో యజ్ఞాలుచేసి, యజ్ఞశేషపదార్థాలైన బూడిద మున్నగు వాటిల్ని ఆ నదీజలాల్లో కల్పారు. ఎందరో తపస్సులు చేసి, తపశ్శక్తిని అర్ఘ్యప్రదానరూపంలో ఆయా నదీజలాల్లో సమర్పించారు. కనుక తరచుగా నదీనదజల (తూర్పున పుట్టి – పడమరగా ప్రవహించేవి నదాలు. పడమట పుట్టి–తూర్పుగా ప్రవహించేవి నదులు) స్నానం, పానంవల్ల ఎంతో పుణ్యం, ఆరోగ్యం లభిస్తుంది. పుణ్యనదులపేర్లు స్మరిస్తూ – ఇంట్లో ఉండే నీళ్లతో స్నానం చేసినా, నదీస్నానఫలం దక్కుతుందని పెద్దలు నిర్వచించారు.

నీటికీ, మనిషికీ అవినాభావసంబంధం ఉంది. మన శరీరం ఐరన్, ఫాస్పరస్, మెగ్నీషియం, మొదలైన లోహాలూ, ఆమ్లాలూ, క్షారాలతో నిండిన ఒక టెస్ట్‌ట్యూబ్. మన ఆలోచనలు కూడా రసాయనికఅణువులప్రవాహమే!

కొన్ని ఆలోచనలు మనదేహపుగ్రంథుల్లో కొన్నింటిని ఉత్తేజపరచి కొన్నిరకాల రసాయనాలను విడుదలచేస్తాయి. మనలోని జీవరసాయనాల స్థాయిని ఎప్పటికప్పుడు సమతూకంలో ఉంచుకోవడానికి స్నానప్రక్రియ ఎంతో తోడ్పడుతుంది.



# కృష్ణాపుష్కర ప్రాశస్త్యం

డా॥ ఈమని శివనాగిరెడ్డి
98485 98446

**సకలప్రాణులకు జలం జీవనాధారం. ఈ జలాన్నందించే జీవనదులవద్దనే మానవునితొలి సంస్కృతీ ప్రారంభ, వికాసాలకు సంబంధించి అనేకచారిత్రకాధారాలు నైలు, సింధు మొదలైన నదీలోయప్రాంతాల్లో లభించాయి. జీవనాధారాలైన నదులను మనదేశంలో దేవతాస్వరూపాలుగా భావించి, పూజించటం సంప్రదాయమైంది.**

పుట్టినచోటు నుండి 8000 ధనుస్సుల దూరం దాటి వెళ్ళిన ప్రవాహాన్ని 'నది' అనీ, ఇంతేకాక నాదాన్ని సృష్టించేది గనుక నది అనీ జలప్రవాహాలైన నదుల్ని గురించి చెప్పారు. పుష్కరవిజ్ఞానం జలానికి సంబంధించింది. ఈ పుష్కర పుణ్యకాలంలో కోట్లదేవతలు, ఋషులు, పితరులు మానవరూపంలో సంవత్సరానికోసారి దేవగురువైన బృహస్పతితో వస్తారని, ఆ గురువు మేషాదిరాశులలో సంచరించేటపుడు సంవత్సరానికి ఒకరాశి చొప్పున ప్రయాణిస్తాడనీ, సకలదేవతా పరివృతుడైన బృహస్పతి ఏ రాశిలో ప్రవేశిస్తే–ఆ రాశికి సంబంధించిన నదికి పుష్కరం వస్తుందని చెప్పాయి–శాస్త్రాలు.

## పుష్కరకథ

పుష్కర పుట్టుపూర్వోత్తరాలకు సంబంధించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ఒక కథప్రకారం, పూర్వం తుందిలుడనేవాడు పరమేశ్వరుణ్ణి గురించి తపస్సు చేసి, పరమేశ్వరునిలో శాశ్వతంగా ఉండేట్లు వరం అడగ్గా, పరమేశ్వరుడు తుందిలునికి జలరూపంలో స్థానమిచ్చి, మూడున్నరకోట్లపుణ్య తీర్థాలకు సార్వభౌముడుగ ఉండ మని అనుగ్రహిస్తాడు. తన సృష్టికి జలం అవసరం కాగా, జలంకోసం బ్రహ్మ పరమేశ్వరుణ్ణిగురించి తపస్సు చేసి, పుష్కరుడు తన కమండలంలో నివాసం ఉండేటట్లు వరం పొందుతాడు. తర్వాత బృహస్పతి బ్రహ్మనుగురించి తపస్సు చేసి, తన అధీనంలో పుష్కరుణ్ణి ఉంచమని కోరగా, బ్రహ్మను విడిచి వెళ్ళటం ఇష్టంలేని పుష్కరుడు బ్రహ్మనుకూడా తనతో రమ్మని వేడుకొంటాడు. గ్రహస్వరూపుడైన బృహస్పతి మేషాదిరాశులలో ప్రవేశించేటప్పుడు, నిష్క్రమించేటప్పుడు, 12 రోజులు పుష్కరుడు బృహస్పతితో ఉండాలనీ, ఆ సమయంలో








తాను సమస్తదేవతలతో బృహస్పతి ప్రవేశించే రాశికి అధిష్ఠానమైన పుణ్యనదికి వస్తూ ఉంటానని బ్రహ్మ ఏర్పాటుచేశాడు. అప్పటినుండి నదులకు పుష్కరాలు ఏర్పాటు అయ్యాయని తెలుస్తూంది.

ఈ సంవత్సరం బృహస్పతి రాశిచక్రభ్రమణంలో ఆరవరాశి అయిన కన్యాలగ్నంలో ప్రవేశించటంచేత నదులలో ఆరవదియైన కృష్ణానదికి పుష్కరాలు జరుగుతున్నాయి. ఈ పుష్కరాన్ని 'కన్యకాభాగీరథి' అని కూడా అంటారు. బృహస్పతి కన్యాలగ్నంలో పాదం మోపే మొదటి పన్నెండురోజులే కృష్ణాపుష్కర విశేషదినాలుగా జరుపుకొనటం జరుగుతుంది.

ఈ సంవత్సరం పుష్కరోత్సవం జరుపుకొంటున్న కృష్ణానది పుట్టుపూర్వోత్తరాల గురించిన వివిధకథలు ప్రచారంలో ఉన్నాయి. ఒక కథ ప్రకారం బ్రహ్మ సహ్యాద్రిపైన యజ్ఞం చేయటానికి అన్ని వస్తువులనూ సమకూర్చుకొని సిద్ధంగా ఉంటాడు. ముహూర్తం సమీపించినా సరస్వతి రాలేదు. ముహూర్తవేళమించిపోతున్న సమయంలో విష్ణువు మొదలైన దేవతలు, బ్రహ్మ రెండవ భార్యయైనగాయత్రితో యజ్ఞాన్ని నిర్వర్తించమనగా బ్రహ్మ ప్రారంభిస్తాడు. కొంతసేపటికి అక్కడికి వచ్చిన సరస్వతి, తనరాకకు ముందే యజ్ఞాన్ని ప్రారంభించడం చూచి, ఆగ్రహించి, దేవతల్ని నదులుగా పుట్టండని శపించగా విష్ణువు కృష్ణగా, శివుడు వేణిగా, బ్రహ్మ కకుద్మతిగానూ రూపొంది, మూడూ కలిసి, సహ్యాద్రిపర్వతపంక్తి నుండి ప్రవహించగా 'కృష్ణా'నది ఆవిర్భవించింది.

కృష్ణుడు సహ్యాద్రిపైన అశ్వత్థరూపంలో ఉన్నాడనీ, ఆ చెట్లవ్రేళ్లనుండి కృష్ణానది అవతరించిందనీ ప్రతీతి. అందుచేతనే కృష్ణానదిని విష్ణుస్వరూపిణిగ పేర్కొనడమైంది.

**బృహస్పతి పుష్కరునితో కలిసి మేషరాశిలో ప్రవేశించినపుడు గంగానదికి, వృషభరాశిలో నర్మదకు, మిథునంలో సరస్వతికి, కర్కాటకంలో యమునకు, సింహంలో గోదావరికి, కన్యలో కృష్ణకు, తులలో కావేరికి, వృశ్చికంలో భీమరథికి, ధనుస్సులో పుష్కరవాహినికి, మకరంలో తుంగభద్రకు, కుంభంలో సింధునదికి, మీనంలో ప్రణీతానదికి పుష్కరాలు జరుపుతారు.**

ఆ ప్రాంతంలో గల ఉసిరికచెట్టు నుండి వేణీనది అవతరించి, కృష్ణానదితో ఏకమై కృష్ణవేణీనదిగా రూపొందింది. మరో కథప్రకారం, ద్వాపరయుగంలో రాధాకృష్ణులు ప్రణయకోపావేశంతో గంగాదిపుణ్యనదుల పేర్లతోనున్న గోపికలను భూలోకంలో పుట్టేటుగా శపించారనీ, గోపికలు తమ శాపవిమోచనానికై ప్రార్థించగా, రాధాకృష్ణులు అనుగ్రహించి, భరతఖండంలో మీ మీ పేర్లతో పుష్కరమహానదులై ప్రవహించి, సకలజీవుల్నీ ఉద్ధరించండని శెలవిచ్చారనీ, తదుపరి గోలోకంలో ఉన్న కృష్ణుడు తనపాదం నుండి గంగను, సహ్యాద్రిపై అశ్వత్థరూపంలో ఉన్న కృష్ణుడు తన శరీరవామభాగం (రాధారూపం) నుండి కృష్ణానదినీ పుట్టించాడనీ అందుచేతనే 'కృష్ణే కృష్ణాంగ సంభూతే జంతూనాం పాపహారిణి' అని కృష్ణానదిని స్తుతించటం జరిగిందనీ చెప్పబడింది.

ఇంకా కృష్ణాపుష్కరాలకు సంబంధించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. వేరొక కథప్రకారం, వరుణలోకంలో గల కృష్ణానదీ దేవత వివిధమహర్షుల ప్రార్థనల కనుగుణంగా వివిధరూపాలతో దర్శన మిచ్చిందనీ చెప్పబడింది.

ఒకచేతిలో కుంభం, మరోచేతిలో వరుణపాశాన్నీ ధరించి, మకరవాహనారూఢయై ఉండే విధంగా శ్రీతత్త్వనిధి అనే శిల్పశాస్త్రంలో గంగా, యమునా, గోదావరీ, కృష్ణా, రేవా, తాపీ, వేణీ, సరస్వతీ నదులకు సమష్టిగా చెప్పబడిన రూపాన్నే కృష్ణానదీ దేవతారూపంగా విజ్ఞులు నిర్ణయించారు. విజయవాడ ప్రకాశం బ్యారేజి ముందు ప్రతిష్ఠించిన 'కృష్ణవేణీ' శిల్పం ఈ రూపధ్యానాన్ని అనుసరించి రూపొందించిందే!

ఇంకా చెప్పబడిన వివిధరూపాలలో – 1)నాలుగు చేతులలో రెండింట అమృతకలశాలు, వరదముద్ర కల్గి,

పద్మాన్ని ధరించి, పద్మాసనంపై ఉండే రూపం; 2)కమండలం, జపమాల ధరించిన రూపం; మరియు 3)చక్రం. త్రిశూలం, పరశు, అక్షమాలను ధరించి, మూడుకన్నులతో, హంస వాహనారూఢయై తీర్థరాజైన పుష్కరునితో ఉండే రూపాలు ప్రశస్తమైనవి.

ఇలాంటి కృష్ణానది ఆంధ్రదేశంలో మిక్కిలి పొడవైన నదులలో రెండవది. మహారాష్ట్రలోని మహాబలేశ్వరంవద్ద పుట్టి, ఆంధ్రదేశంలో తాగ్గిడిగి (మహబూబ్ నగర్ జిల్లా) వద్ద ప్రవేశించి, కర్నూలు, నల్గొండ, గుంటూరు, కృష్ణాజిల్లాలలో మొత్తం 720 కి.మీ. ప్రవహించి, కృష్ణాజిల్లాలోని హంసలదీవి వద్ద రెండుపాయలుగా చీలి, సాగరంలో కలుస్తుంది. మహాబలేశ్వరం నుంచి సాగరసంగమం వరకూ మొత్తం 1440 కి.మీ.ల దూరం ప్రవహిస్తుంది.

పుష్కరసమయంలో కృష్ణానదిలో స్నానం చేస్తే గంగ, గోదావరి మొదలైన పుణ్యనదుల్లో 12 సంవత్సరాల పాటు స్నానం చేసిన ఫలితం కలుగుతుందనీ, పూర్వజన్మలో చేసిన పాపాలకు విముక్తి కలుగుతుందనీ బ్రహ్మాండపురాణంలో వుంది. కృష్ణాజలస్నానాన్ని గంగాజలస్నానంకంటే పరమ పవిత్రంగా భావించారు. ప్రచారంలో ఉండే ఒక కథ ప్రకారం గంగాతీరంలో ఉండే ఒక వేశ్య, రాత్రిళ్లు వ్యభచరిస్తూ పాపవిముక్తికి ఉదయాన్నే గంగాస్నానం చేసేది. ఈ విధంగా పాపపంకిలమైన గంగ 'కాకి' రూపంలో కృష్ణలో స్నానం చేసి, తన మలినాన్ని పోగొట్టుకొని, పరిశుద్ధయై 'హంస' రూపంతో తిరిగి వేళ్లేదని చెప్పబడింది.

పుష్కరసంవత్సరకాలంలో మొదటి 12 రోజులు ప్రధాన పుష్కరంగానూ, సంవత్సరమధ్యన మధ్య పుష్కరమనీ, అంత్యమున అంత్య పుష్కరమనీ వ్యవహరిస్తారు. ఈ మూడు సమయాల్లోనూ, స్నాన దాన శ్రాద్ధ విధులను నిర్వర్తించవచ్చునని చెప్పబడింది. నదిలో దిగ బోవునపుడు కృష్ణానదికి, తీర్థరాజుకు, బృహస్పతికి, విష్ణువుకు, శివునికీ, బ్రహ్మాదిదేవతలకు, మునులకు, గంగాదినదులకు, సూర్యునికి అర్ఘ్యంతో నమస్కరించి పుష్కరవిధులు నిర్వర్తించాలని ఉంది.

## కృష్ణవేణీ ప్రభావం

**నమామి సుకృతశ్రేణీం కృష్ణవేణీం తరంగిణీమ్ ।**
**యద్వీక్షణం కోటిజన్మ కృత దుష్కర్మశిక్షణమ్ ॥**

**పుణ్యపరంపరలు కల ఏ నదిని చూచినంతమాత్రాన్నే కోటిజన్మలలో చేసిన పాపాలు శమిస్తాయో అటువంటి నదీమతల్లి కృష్ణవేణికి నమస్కరిస్తున్నాను.**

కృష్ణాపుష్కరసందర్భంగా, సంకల్పం చెప్పడానికి, శుచియై, కృష్ణానదిని సమీపించి, కృష్ణానదీధ్యానం చేసి, ఆచమనం చేసి, సంకల్పం", పరమేశ్వర ప్రీత్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం కన్యాగతే దేవగురౌ సార్ధ త్రికోటి తీర్థ సహిత మహా పుష్కర పర్వణి పుణ్యకాలే కృష్ణానదీస్నాన మహం కరిష్యే" అని చెప్పాలి. తరువాత ప్రవాహాని కెదురుగా వెళ్లి, మూడుసార్లు స్నానం చేసి, సూర్యుని కెదురుగా మూడుసార్లు స్నానంచేసి, సూర్యునికి అర్ఘ్యమిచ్చి, మరోమారు స్నానం చేయాలి. తరువాత దక్షిణ ముఖంగా తిరిగి, పితృతర్పణం చేసి, తిరిగి ప్రవాహాభిముఖంగా స్నానం చేసి, కృష్ణానదీజలాలను పూజించి తీర్థాన్ని పుచ్చుకొని, ఒడ్డుకు చేరి, నూతనవస్త్రాలు ధరించాలి. తర్వాత ఇష్టదేవతాదర్శనం, దానధర్మాలూ చేయాలని చెప్పబడింది.

పుష్కరసమయాల్లో నదీజలాలు, ఆధిదైవికతేజస్సు పొంది ఉంటాయి. కాబట్టి ఆ సమయాల్లో స్నాన, దాన, జప, అర్చన, ధ్యాన, హోమ, తర్పణాది అనుష్ఠానాలూ, పితృపిండప్రదానాలూ చేయాలని చెప్పబడింది. కృష్ణా పుష్కర దినాలలో అపమృత్యు పరిహారార్థం పుష్కరవ్రతం సూచించబడింది. పుష్కరసమయంలో 12 రోజులు జరిపేవ్రతం 12 ముఖ్యకల్పాల్లో జరిపేవ్రతానికి సమానమనీ, మూడు యామాల ఆయుర్దాయమే మిగిలిన చిత్రరథుడనే రాకుమారుడు కణ్వనుడనే ముని ప్రబోధించే, కృష్ణాపుష్కరవ్రతం ఆచరించి, దీర్ఘాయుష్షు పొందాడనీ కృష్ణాపుష్కర వ్రతమాహాత్మ్యంలో చెప్పబడింది.





# కైంకర్యమే.. తనువు దాల్చితే....

4

- డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478

(జరిగిన కథ - రామానుజులవారిపై గురువు యాదవప్రకాశునికి ఈర్ష్య ఇసుమంత కూడా తగ్గలేదు సరికదా, శిష్యునిపై అకారణ ద్వేషం మరింత పెంచుకున్నాడు. దానితో రామానుజులు ఆలోచనలో పడ్డారు. ఆ తర్వాత.... )

రామానుజులు వేదాలను చదివారు. వేదాంగాలను పఠించారు. బ్రాహ్మణాలను వల్లించారు. ప్రస్థానత్రయమైన ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రాలను, భగవద్గీతను క్షుణ్ణంగా పరిశీలించారు. కానీ, సృష్టికి సంబంధించిన ఒక నిశ్చితమైనఅభిప్రాయం వారికి కలుగలేదు.

వేదవేదాంగాలను, ఉపనిషత్సూత్రాలను, భగవద్గీతను ఆదిశంకరుడు వ్యాఖ్యానించి ఉన్నాడు. అతడు తన వ్యాఖ్యానాల ద్వారా అద్వైతమతాన్ని ప్రచారం చేశాడు. ఆత్మ, పరమాత్మలకున్న సంబంధాన్నిగూర్చి, ఈ ప్రపంచాన్నిగూర్చి అతడే తన అభిప్రాయాలను ఎంతో స్పష్టంగా చెప్పి ఉన్నాడు. తనకున్న అశేష శేముషీధురంధరత్వంవల్ల, తర్కశాస్త్రంలో తనకున్న అతులిత ప్రావీణ్యంవల్ల, అనన్యమైన తనపాండిత్యంవల్ల, నిరర్గళమైన, నిరుపమానమైన, అద్వితీయమైన తన వాక్పటిమవల్ల అతడు మాయావాదాన్ని సృజించి, ఆ వాదంద్వారా తక్కిన వాదాలనన్నిటినీ పరాస్తం గావించాడు. ఆ బాలయోగివచనచమత్కృతికి, అతనివాదనపటిమకు ఆనాడు భారతదేశంలో ప్రాబల్యం వహించి ఉన్న మతాచార్యులందరూ అతనికి దాసోహమనాల్సి వచ్చింది. కానీ, రామానుజులు అద్వైతవాదాన్ని అంగీకరించలేక పోతున్నారు. అందుకే దాన్నిగూర్చి వారంతగా ఆలోచిస్తున్నారు.




తన గురువైన యాదవప్రకాశుడు అద్వైతమతానికొక మూలస్తంభమే. దాన్ని కాదనడానికెవ్వరికీ సాధ్యం కాదు. కాంచీపురపరిసరాల్లో ఆ మతాన్నిగూర్చి సాధికారంగా చెప్పగల వారు మరెవ్వరూ లేరు. కానీ, అతడుకూడా తన సందేహాల్ని తీర్చలేకపోయాడు. తీర్చమని అడిగినప్పుడు తనమీద కోపించుకొన్నాడు. చెప్పింది వినాలి గాని ప్రశ్న వేయడం తప్పన్నాడు. ప్రశ్నవేసినందుకు తన్ను నిందించాడు. తన సమ్ముఖానికి ఇక రావద్దన్నాడు.

ప్రశ్నించడమే తప్పా? ప్రశ్నించకుండా సందేహమెలా తీరుతుంది? ప్రశ్నించకుండా విజ్ఞానమెలా కలుగుతుంది? ఏ మతానికైనా ప్రశ్నలకన్నిటికీ సమాధానమివ్వగల శక్తి ఉండాలి. లేకపోతే అది మతమే కాదు. అది సత్యం కాదు. ఆదిశంకరుడుకూడా ఒకనాడు ప్రశ్నలతో బయలుదేరినవాడే. తర్కానికి మూలం ప్రశ్న. దాన్ని కాదంటే యెలా?

ప్రశ్నవేసినప్పుడు సమాధానం తోచకపోవచ్చు. కానీ, కొంత ఆగి, ఆలోచించి సమాధానం చెప్పాలి. అంతేకాని ప్రశ్నే వేయవద్దంటే అజ్ఞానంలోనే ఉండిపొమ్మని, తాను చెప్పిందే అంగీకరించమని, దాన్నే సత్యంగా విశ్వసించమని. ఒకడు చెప్పినదానినంతటినీ సత్యమని నమ్మేటట్లయితే ప్రతివారు చెప్పినవీ సత్యమనే నమ్మవలసి ఉంటుంది. అదెలా వీలవుతుంది? అందుకనే తాను తన గురువు చెప్పిన దాన్ని అంగీకరించలేదు. గురువు చెప్పినంతమాత్రాన అది సత్యం కాబోదు. అది తర్కానికి, నిర్ధారణకు నిలువగలిగి ఉండాలి. ప్రమాణాలచేత ఋజువు చేయగలిగి ఉండాలి. లేకుంటే అది సత్యంఎలా అవుతుంది?

మహాపురుషులందరూ సత్యంకోసమే అన్వేషించారు. మహర్షులుకూడా సత్యంకోసమే తపస్సు గావించారు. తాము నమ్మిన దాన్ని వారు ప్రచారం చేశారు. ఇదే సత్యమని వారెన్నడూ చెప్పి ఉండలేదు. కానీ, తన గురువైన యాదవప్రకాశుడు మాత్రం తాను చెప్పిన దాన్నే నమ్మమంటాడు. నమ్మనంటే కోపగించుకుంటాడు. అది రామానుజులువారికి ఏ మాత్రం ఇష్టం లేదు.

* * * * * * *

దీనికి సమాంతరంగా తిరుక్కచ్చినంబితో రామానుజులకు అనుబంధం బలపడింది. 'భక్తి' అనే మహోన్నతమైన శక్తి మానవజాతికి క్రమబద్ధమైన జీవనానికి దారి చూపి, సాధ్యమైనంతవరకూ అక్రమాలనుండి, దుర్మార్గాలనుండి, అరాచకాలనుండి దూరమయ్యేందుకు దోహదం చేస్తుంది. మానవాతీతమైన ఒక శక్తిని సర్వులూ అంగీకరిస్తున్నప్పుడు– ఆ శక్తి పట్ల భయం, భక్తి, ఆకర్షణ, ప్రేమ ఇవన్నీ సహజంగానే కలుగుతాయి. అవ్యాజమైన అపేక్ష కలిగినప్పుడు దాన్ని పొందాలనే కాంక్షకూడా సర్వసాధారణంగానే జనిస్తుంది.

దాన్ని సాధించే మార్గమే భక్తిమార్గం. సాధకుడే భక్తుడు. ఈ స్థితికి చేరుకొన్నాక ఆ భక్తుడు నిరంతరాన్వేషణ చేస్తాడు. అందుకోసం ఋషికల్పు లైనవారు అనేకమార్గాలను తాము సాధనచేసి కల్పించారు. ఈ భగవంతునితత్త్వాన్ని తెలుసుకుని, భక్తిపరిపూర్ణుడై హృదయంతో భగవంతుణ్ణి అర్చించేవాడే భాగవతుడు. ఈ భాగవతులతో కూడి చేసేధార్మిక కాలక్షేపాలన్నీ ఎన్నో ప్రయోజనాలు చేకూరుస్తాయి.

భాగవతోత్తములతో కలిసి చేసే జీవనం కేవలం పుణ్యప్రదమైంది మాత్రమేకాదు, మానవహృదయ మాలిన్యాన్ని నిర్మూలించి, వారిని పునీతులుగా చేస్తుంది. సాత్త్వికతను నేర్పుతుంది. అహంకారాన్ని పటాపంచలు చేస్తుంది.

సత్యాన్వేషణలోని ఉపాయాలనూ, భక్తిప్రపత్తులతో భగవంతుణ్ణి ఆరాధించాల్సిన అనేకవిశేషాంశాలనూ భాగవత సత్సంగం కల్పిస్తుంది. పారమార్థికజీవనంతో పాటుగా ఐహిక జీవనంకూడా వీరిసాంగత్యంలో ఫలవంతమౌతుంది.

**జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం**
**మానోన్నతిం దిశతి పాప మపాకరోతి,**
**చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం**
**సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్** **(భర్తృహరి)**

సత్సాంగత్యం వల్ల ఎన్నో సత్ఫలితాలున్నాయి. దానివల్ల బుద్ధిజాడ్యం తొలగుతుంది. అది సత్యాన్నే పల్కిస్తుంది. ఆత్మ గౌరవాన్ని నింపుతుంది. పాపఆలోచల్ని దూరం చేస్తుంది. మనస్సును నిర్మలంగా ఉంచుతుంది. మంచిపేరు ప్రతిష్ఠల్ని సర్వత్ర వ్యాపింపజేస్తుంది. మంచివారితో చెలిమివల్ల అన్ని విధాలైన మంచి కల్గుతుంది.

కనుక సత్కథాశ్రవణం, సత్కావ్యపఠనం, జపం తపస్సు వంటి అనేకమైనసద్గుణాలకు నిలయులు భాగవతులు. వారి వల్లనే సమాజంలో ధార్మికత, నైతికత, సంస్కారం, క్రమశిక్షణ, నిరహంకారత, త్యాగబుద్ధివంటి సద్గుణాలు అలవడుతాయి.

దోషాలు లేని జీవనంతో, సాత్త్వికాహారం స్వీకరిస్తూ, సర్వప్రాణులలోనూ పరమాత్మనే దర్శిస్తూ, కైంకర్యభావంతో మెలగుతూ–సత్కథాకాలక్షేపాలతోనూ, స్తోత్రప్రబంధాదిఅనుసంధానదీక్షలతోనూ జీవితం గడపాలనుకునేవారికి భాగవత సత్సంగం దారి చూపుతుంది.

ఇటువంటి పవిత్రమైనజీవనాన్ని గడపాలని అందరినీ ఆకర్షిస్తూ ప్రోత్సహిస్తుంది. ఇలా జీవించేవారు ఏ కులజులైనా– వారుకూడా భగవంతునితో సమానులే! వారిసాంగత్యం జీవన పరమార్థాన్ని బోధించడమే గాక–ఐహికజీవనం వ్యర్థంకాకుండా– సార్థకమయ్యేటట్లు పారమార్థికత ఒంటబట్టేటట్టు చేస్తుంది.

ప్రతివ్యక్తీ ఇలా మార్పు చెందడంద్వారా మరి కొందరు ప్రభావితులై లోకం శాంతియుతంగా మారడానికీ, దోషరహిత సమాజం రూపొందడానికీ భాగవతసత్సంగమే ప్రయోజనకారి అవుతుంది.

*(ఇంకా ఉంది)*

# పంచనారసింహక్షేత్రాలూ... కృష్ణాతీరంలోనే...

- ఐ.ఎల్.ఎన్. చంద్రశేఖర్‌రావు
94919 46070

**శ్రీనారసింహుడు ఆంధ్రులకు ఆరాధ్యదైవం.**
**అందుకే తెలుగునేల నలుచెరుగులా శ్రీ నరసింహస్వామి కొలువుదీరిన ఆలయాలు అనేకం దర్శనమిస్తాయి.**
**ఈ నరసింహక్షేత్రాలలో "పంచనారసింహక్షేత్రాలు" ప్రధానమైనవి.**

**మంగళగిరి, వేదాద్రి, మట్టపల్లి, వాడపల్లి, కేతవరం అనే ఐదుక్షేత్రాలు పంచనారసింహక్షేత్రాలు. పవిత్రమైన కృష్ణానదీతీరంలోనే ఉన్న ఈ పంచనారసింహక్షేత్రాలను స్మరించడం, దర్శించడం, పూజలు నిర్వహించడంవల్ల సకలభయాలు, గ్రహపీడలు, జన్మజన్మల పాపాలు నశించి, ఆయురారోగ్యాలు వృద్ధి చెందడంతో పాటూ అనంతమైన పుణ్యఫలాలు లభిస్తాయి.**

## మంగళగిరి

పానకం బిందెలకొద్దీ అయినా, గరిటెడే అయినా సగం మాత్రమే స్వీకరించి మిగతాసగం భక్తులకు ప్రసాదంగా ఇస్తూ **"పానకాలరాయుడు"**గా ప్రసిద్ధిచెందిన శ్రీలక్ష్మీనరసింహస్వామి కొలువుదీరిన దివ్యక్షేత్రం- **"మంగళగిరి".**



మంగళగిరిక్షేత్రంలో కొండపైన ఒక ఆలయం, ఊరిలో ఒక ఆలయం ఉంది. కొండపైన ఉన్న ఆలయం శ్రీ పానకాల నరసింహస్వామిఆలయం. ఐదువందలమెట్లు ఉన్న సోపానమార్గం లేదా ఘాట్‌రోడ్ ద్వారా ఆలయానికి చేరుకోవచ్చు. కొండపైన ఆలయం-ముఖమండపం, అంతరాలయం, గర్భాలయాలు కలిగి ఉంది. గర్భాలయంలోని స్వామివారు పశ్చిమాభిముఖంగా గర్భాలయంగోడకు పెద్దగా తెఱచిననోరుతో కొలువుదీరి దర్శనమిస్తారు. భక్తులు స్వామివారికి పానకం సమర్పిస్తారు. సగం స్వీకరించి, సగం భక్తులకు ప్రసాదంగా ఇస్తాడు-స్వామి. కొండపైన ఆలయం మధ్యాహ్నం పన్నెండుగంటల వరకు మాత్రమే తెరచి ఉంటుంది. అనంతరం ఈ ఆలయంలోని స్వామివారిని దేవతలు, మునులు అర్చిస్తారని ప్రతీతి.

'మంగళగిరి' ఊరిలోని ఆలయంలోనికి ప్రవేశించే ప్రధానమైన తూర్పుద్వారంపై 11 అంతస్తులతో - 153 అడుగుల ఎత్తు గల గోపురం విశేషంగా భక్తుల్ని ఆకర్షిస్తూంది. ప్రధానగర్భాలయంలో శ్రీలక్ష్మీనరసింహస్వామి శాంతమూర్తిగా శంఖ, చక్ర, అభయముద్రలు ధరించి, వామాంకంపై లక్ష్మీదేవిని కూర్చుండబెట్టుకుని దర్శనమిస్తాడు. ఈ స్వామివారిని ద్వాపరయుగంలో, వనవాస సమయంలో ధర్మరాజు ప్రతిష్ఠించినట్లు ప్రతీతి. స్వామివారి

దేవేరి శ్రీరాజ్యలక్ష్మీదేవి ప్రత్యేకగర్భాలయంలో కొలువుదీరి పూజలందుకుంటూ ఉంది. ఆలయప్రాంగణంలోని ఉపాలయంలో శ్రీసీతారామలక్ష్మణులు దర్శనమిస్తారు. ఆలయ సమీపంలో శ్రీలక్ష్మీపుష్కరిణినీ, సమీపంలో ప్రపత్తిఆంజనేయస్వామివారినీ భక్తులు దర్శించవచ్చు.

## వేదాద్రి

కృష్ణానదిలో స్నానమాచరించినంతనే భక్తులకు తనతో కలిసి స్నానం చేసిన ఫలాన్ని ప్రసాదిస్తూ ఉన్న శ్రీనరసింహస్వామి 'స్నానాలయ్య'గా పేరుపొంది, అశేషభక్తుల ఆరాధనలందుకుంటూ ఉన్న క్షేత్రం – **"వేదాద్రి".**

సృష్టి ప్రారంభంలో సోమకుడనే రాక్షసుడు వేదాలను దొంగి లించుకుపోయి, సముద్రగర్భంలో దాచగా– విష్ణువు మత్స్యావ తారాన్ని ధరించి, సోమకాసురుణ్ణి అంతమొందించి, వేదాల్ని రక్షించాడు. ఈ సమయంలో వేదపురుషులు "నిత్యం మీతోనే ఉండే భాగ్యాన్ని కలిగించ"మని శ్రీహరిని ప్రార్థించగా... "ఇప్పుడు కుదరదు.. భవిష్యత్తులో అలానే జరుగుతుంది. సాలగ్రామరూపాలుగా కృష్ణానదిలో ఉండండి" అని సమాధానం ఇచ్చాడు. తర్వాత నరసింహావతారాన్ని ధరించి, హిరణ్యకశిపుణ్ణి అంతమొందించి, వేదపురుషులకిచ్చిన మాట ప్రకారం ఇక్కడికి చేరి **"జ్వాలానరసింహస్వామి"** గా కొలువుదీరాడు. అనంతరం బ్రహ్మదేవుడు స్వామివారిని సత్యలోకం తీసుకువెళ్ళగా, సత్యలోకం దగ్ధమై పోసాగింది. దీనితో బ్రహ్మ స్వామివారిని తీసుకొనిపోయి, కృష్ణవేణిగర్భంలో సాలగ్రామపర్వతంమీద ప్రతిష్ఠించాడు. అనంతరం ఋష్యశృంగాది మహర్షులు, మానవులు, మహారాజులు ప్రార్థించడంవల్ల స్వామివారు **యోగానందనరసింహస్వామి**గా వెలసినట్లు కథనం. తూర్పున ఐదుకిలోమీటర్ల దూరంలో వీరనరసింహమూర్తిగానూ గరుత్మంతుడికోరికమేరకూ, లక్ష్మీనరసింహరూపంలో వనదేవతలకోరికమేరకూ కొలువుదీరినట్లు స్థలపురాణం. ఈ విధంగా జ్వాలా, సాలగ్రామ, యోగానంద, వీర, లక్ష్మీనరసింహస్వాములరూపంలో కొలువుదీరిన వేదాద్రి పంచనరసింహక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది.



వేదాద్రిక్షేత్రంలో పశ్చిమాభిముఖంగా ప్రధాన ఆలయం ఉంది. ముఖమండపం, గర్భాలయాలు కలిగిన ప్రధాన ఆలయగర్భాలయంలో శ్రీ యోగానందనారసింహస్వామివారు కొలువుదీరి ఉన్నారు.

కృష్ణాజిల్లాలో జగ్గయ్యపేట మండలంలో ఉన్న వేదాద్రి ముక్త్యాలకు 15, జగ్గయ్యపేటకు 18, చిలకల్లుకు 10 కిలోమీటర్లదూరంలో ఉంది.

## మట్టపల్లి

దక్షిణావృతశంఖంతో పాటు స్వామివారు స్వయంభువుగా అవతరించి.... కేవలం తనను ఆరాధించినంతనే భక్తులకు అన్నానికి లోటులేకుండా చేసే **"అన్నాలయ్య"**గా పేరు పొంది, భక్తుల ఆరాధనలందుకుంటూ ఉన్న శ్రీలక్ష్మీనరసింహస్వామి కొలువుదీరిన దివ్యక్షేత్రం– **"మట్టపల్లి".**

కృష్ణానదికి ఎదురుగా ఈ ఆలయం ఉంది. ఈ ఆలయముఖమండపంలో శ్రీగోదాదేవి, శ్రీవైఖానసమహర్షి, అద్దాలమండపాలు ఉన్నాయి. ప్రధానగర్భాలయంలో స్వయంభువు అయిన శ్రీ నరసింహస్వామి చతుర్భుజాలతో కొలువుదీరి ఉన్నాడు. శంఖ, చక్ర, అభయ, వరద ముద్రలతో, వక్షస్థలంపై కౌస్తుభంతో, రాజ్యలక్ష్మీదేవితో స్వామివారు దివ్యతేజస్సుతో దర్శనమిస్తారు. స్వామివారి సమీపంలో ప్రహ్లాదుడు కొలువుదీరి ఉన్నాడు. అక్కడే దక్షిణావృతశంఖం ఉంది. దీనినుంచి పవిత్రమైన నాదం వినిపిస్తూ



ఉంటుంది. ఈ శంఖం ఉన్నచోటు దర్శించినవారికి అన్నానికి లోటు ఉండదు. ఆకలిబాధలుండవు. ఈ క్షేత్రం చిన్నదే అయినా అనేకఅన్నదానకేంద్రాలు ఉండడం అందుకు నిదర్శనం. ఈ క్షేత్రంలో నిత్యం అన్నదానం జరుగుతూ ఉండడం, స్వామివారిని అర్చించినవారికి అన్నానికి లోటు లేకపోవడంవల్ల ఈ స్వామివారికి **'అన్నాలయ్య'** అనిపేరు. కాగా, గర్భాలయంలో దక్షిణంవైపున సొరంగం ఉంది. ఇది కృష్ణానదివరకూ ఉంది. కృష్ణానదికి వరదలు వచ్చిన సమయంలో దీనిగుండా నీరు వచ్చి, స్వామివారి పాదాలను అభిషేకిస్తాయి. స్వామివారికి సమీపంలో స్వామివారిదేవేరి ప్రత్యేకంగా కొలువుదీరి పూజలందుకుంటూ ఉంది. ఆలయానికి ఎదురుగా 'ఆరె' వృక్షం ఉంది. దీనిఆకులతో స్వామివారిని పూజిస్తారు.

## వాడపల్లి

**"దీపాలయ్య"**గా పేరు పొందిన శ్రీనృసింహస్వామి వారు కొలువుదీరిన దివ్యక్షేత్రం – **"వాడపల్లి".**



మూసీనది కృష్ణానదిలో సంగమించే సంగమస్థలిలో ఉన్న వాడపల్లి క్షేత్రంలో శ్రీలక్ష్మీనరసింహస్వామివారి ఆలయం దక్షిణాభిముఖంగా ఉంది. ప్రవేశమండపం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయాలు కలిగి ఉన్న ప్రధాన ఆలయముఖమండపంలో ఆళ్వారులు కొలువుదీరి ఉన్నారు. ప్రధానగర్భాలయంలో శ్రీ స్వామివారు చతుర్భుజాలు కలిగి–శంఖ, చక్ర, అభయ, వరదముద్రలు ధరించి, వామాంకంపై లక్ష్మీదేవిని కూర్చుండ బెట్టుకుని దర్శనమిస్తారు. సాధారణంగా శ్రీలక్ష్మీదేవితో కూడిన స్వామివారు శాంతమూర్తిగా ఉంటారు. అయితే ఈ క్షేత్రంలో లక్ష్మీదేవితో కూడిఉన్న స్వామివారు ఉగ్రరూపంలో ఉండడం విశేషం. స్వామివారికి దగ్గరలో గర్భాలయంలో రెండుదీపాలు అఖండంగా వెలుగొందుతూ ఉంటాయి. రెండింటిలో ఒకటి ఎప్పుడూ కదులుతూ ఉంటుంది. గాలిదూరేస్థితి లేకున్నా దీపం కదులుతూ ఉండడం విశేషం. స్వామివారి ఉచ్ఛ్వాస నిశ్వాసాలవల్ల అలా కదులుతూ ఉంటుంది. ఇందువల్ల స్వామివారికి **"దీపాలయ్య"** అని పేరుంది. ఆలయముఖమండపంలో స్వామివారిదేవేరి శ్రీఆదిలక్ష్మీదేవిగా కొలువుదీరి పూజలందుకుంటూంది.

## కేతవరం

**"వజ్రాలయ్య"**గా భక్తులతో పిలువబడుతూ, పిలిచి నంతనే పలికే దేవుడుగా పేరుపొందిన శ్రీనృసింహస్వామి వారు కొలువుదీరిన దివ్యక్షేత్రం – **"కేతవరం".**

క్రీ.శ.11వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని పరిపాలిస్తూండిన కేతవర్మవద్ద స్థానికపాలకుడుగా ఉండిన యాదవరాజుకు ఒకరోజు స్వప్నంలో నృసింహస్వామి సాక్షాత్కరించి, తన ఉనికిని తెలియజేశాడు. యాదవరాజు స్వప్నవృత్తాంతాన్ని కేతవర్మకు వివరించాడు. కేతవర్మ మరుసటిరోజు అందరినీ వెంట బెట్టుకుని, కొండపైకి చేరుకుని, గాలించగా కొండలో శ్రీనృసింహస్వామి, శ్రీలక్ష్మీదేవిఅమ్మవారలు దర్శనమివ్వడంతో... రాతిస్తంభాలతో కొండపైన ఆలయాన్ని నిర్మించి, పూజలు జరిపించాడు. అయితే అందరూ కొండనెక్కి స్వామివారిని దర్శించలేరు గనుక కొండదిగువన మరో ఆలయాన్ని నిర్మించి, స్వామివారిని ప్రతిష్ఠింపజేశాడు.



అనంతరం ఆలయంవద్ద కోనేరు త్రవ్వుతూ ఉండగా పని చేస్తూ ఉన్న ఒక కూలికి రాయి గుచ్చుకుని కాలినుంచి రక్తం కారసాగింది. ఆరక్తాన్ని నీటితో శుభ్రం చేయగా కాలికి గుచ్చుకున్నది రాయికాదని, వజ్రం అనీ తేలింది. మరిన్ని వజ్రాలు లభిస్తాయని లోతుకు త్రవ్వగా స్వామివారి ఉత్సవ మూర్తులు లభించాయి. ఇలా వజ్రాలు ధరించే ప్రాంతంలో కొలువుదీరిన స్వామి కనుక **"వజ్రాలయ్య"** అని స్వామివారికి పేరు. కాగా, కృష్ణానదీతీరంలో ఉన్న మరో ఆలయాన్ని రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు నిర్మింపజేశాడు.

కేతవరంలోని మూడు ఆలయాల్లో శ్రీలక్ష్మీనరసింహ స్వామివారు కొలువుదీరి ఆరాధనలందుకుంటూ ఉన్నారు. గ్రామానికి రెండుకిలోమీటర్లదూరంలోని కొండపైన ఆలయం ఉంది. 600 మెట్లు ఎక్కివెళ్లితే కొండపైనఉన్న ఆలయంలో శ్రీనరసింహస్వామి, శ్రీ చెంచులక్ష్మీదేవి దర్శన మిస్తారు. ఈ ఆలయసమీపంలో కృష్ణానది ఉత్తరవాహినిగా ప్రవహిస్తూ ఉంది. ఇందులో స్నానం చేసి, దేవతామూర్తుల్ని దర్శించుకోవడంవల్ల ఇహంలో సౌఖ్యం, పరంలో మోక్షం సిద్ధిస్తుంది.

తెలుగునేలపైన ఉన్న ఈ పంచనారసింహక్షేత్రాలను దర్శించడం అనంతపుణ్యప్రదం. కృష్ణానదీతీరంలో పున్నెపు రాసులుగా ప్రసిద్ధి చెందిన పంచనారసింహక్షేత్రాలను దర్శించి, భక్తులు తరించవచ్చు.



## జనజీవననిధి

లోకపావనికృష్ణ! సాహితీ పరితృష్ణ!
విజయపురి కాపురికి అర్ఘ్యపాద్యభినిష్ఠ!
నువు బ్రహ్మగిరిలోపుట్టి - వేదగిరి "వేణి"తో
కలగలసి ప్రవహించి కృష్ణవేణివయ్యావు!

శాతవాహనరాజ్య సిరిసంపదలు నీవి
అమరావతికి అమరకీర్తి నందించావు
ఆ దీపాల దిన్నె వెన్నెలల వెలుగులు నీవి!

శ్రీశైలక్షేత్రాన్ని - అహోబిల ప్రాంతాన్ని
హంపీ విరూపాక్ష - విఠలాలయాలను
భక్తి భావాలతో అర్చించి అలరారి
హంసలదీవిలో రాజహంసిగ చరించావు!

జాయపసేనాని నృత్తరత్నావళికి
దివి సీమ సిద్ధేంద్ర కూచిపూడి ప్రభకు
మొవ్వలో క్షేత్రయ్య మువ్వల గోపాలునికి
గొజ్జంగి పూదండల నీ కైదండలేశావు!

ఆ కొల్లేరు సరసున విహంగ విన్యాసాలు
ఆ లక్షల పక్షుల చక్షురుత్సవసొబగు
పింగళి సూరన్న - అరిపిరాల - దండమూడి
ఆ పద్యవిద్యా వాయులీన మృదంగాలు!

మేకమేయనితీగ మూలికల కషాయాలు
ఆయుర్వేద వైద్యాలతో మా ఆయుష్షు పెంచావు
హస్తకళలకు దారి అద్దక కలంకారి
ఆ కొండపల్లి బొమ్మలకొమ్మల సోయగాలు!

నీ తీరభూమిలో ఆకులన్నీ నీకు ఆలయాలమ్మా!
సురభిళ పుష్పాలు నీ పూజకు సహస్రదీపాలు!
యక్షులే పక్షులై నీ స్తుతులు చేస్తుంటాయి!
వెన్నెలలు తారకలు నీ అభిషేక అర్చనలు!

మా తీరభూములను హరితభరితం చేస్తూ
సర్వప్రాణులకున్న దాహార్తులను తీరుస్తూ
సస్యశ్యామల సుజల సుఫలాల నందించు
మా ఆయురారోగ్యాల బలము నీ జలమేనమ్మా!!

- డా॥ కలువగుంట రామమూర్తి, 92474 99120

# నివృత్తి సంగమేశ్వర క్షేత్రం

- శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, 99896 79681



**శ్రీ సంగమేశ్వరక్షేత్రం కర్నూలుజిల్లాలోని కొత్తపల్లి మండలంలో ఉంది. ఈ క్షేత్రం కృష్ణవేణీ నదీతీరాన శ్రీశైలం నుంచి ప్రారంభమయ్యే నల్లమల అడవుల్లో ఉంది. ఇది కర్నూలుకు 55 కి.మీ., నందికొట్కూరుకు 35 కి.మీ., మూర్వ కొండకు దాదాపు 9 కి.మీ. దూరంలో ఉంది.**

ఈ క్షేత్ర పురాణాన్ని ఈశ్వరుడు పార్వతితో చెప్పినట్లు స్కాందపురాణాంతర్గత ఉమామహేశ్వర సంవాదంలో ఉంది. అతి పురాతనమైన ఈ క్షేత్రం దగ్గర సప్తనదులు సంగమిస్తాయి. ఇక్కడ ఈశ్వరుడు వెలిశాడు. అందువల్ల ఈ క్షేత్రానికి సప్తనదీసంగమేశ్వరం, నివృత్తిసంగమేశ్వరం, భాస్కర క్షేత్రం మొదలయిన పేర్లు కూడా ఉన్నాయి. ఆయా పేర్లు కలగటానికి కారణాలను తెలిపే గాథలు స్కాందపురాణంలో కనిపిస్తాయి.

ఈ క్షేత్రంలో సంగమించే సప్తనదులు (1) కృష్ణ (2) వేణీ (3) తుంగ (4) భద్ర (5) భీమరథి (6) మలాపహారిణి (7) భవనాశిని. సప్తనదుల సంగమస్థానంలో స్నామాడి సంగమేశ్వరుని పూజిస్తే ముముక్షువులకు మోక్షం తదితర భక్తులకు కామ్యార్థాలు సిద్ధిస్తాయని స్థలపురాణం చెప్తోంది.

ఇక్కడి శివలింగం భారతకాలంలో ధర్మరాజుచే ప్రతిష్ఠింపబడిందని స్థలపురాణం చెప్తోంది. ధర్మజుని తమ్ముడైన భీముడు ఈ శివలింగ ప్రతిష్ఠలో ప్రముఖపాత్ర వహించటంచేత ఇక్కడి లింగానికి భీమలింగం అని పేరు కలిగింది.

దక్షుడు ఈ క్షేత్రంలో యజ్ఞం చేశాడనీ ఆ యజ్ఞానికి సతీదేవి విచ్చేసి పరాభవించబడి ప్రాణత్యాగం చేసిందనీ, సతీ ప్రాణనివృత్తి చేసిన స్థలం కాబట్టి దీనికి నివృత్తి సంగమక్షేత్రమనే పేరు కలిగిందనీ పురాణగాథ.

సర్వపాపాలు నివృత్తి చేయగల మహిమోపేతమైన తీర్థంగల క్షేత్రం కనుక నివృత్తి సంగమక్షేత్రం అనే పేరు వచ్చిందని మరో కథనం.

"నివృత్తి సంగమేస్నాత్వా సర్వతీర్థ ఫలంభవేత్" నివృత్తి సంగమక్షేత్రంలో స్నానం చేస్తే సర్వతీర్థాలలో స్నానం చేసిన ఫలితం లభిస్తుందని నమ్మకం.

సంగమేశ్వరంలోని భీమసేనప్రతిష్ఠిత లింగాన్ని దర్శిస్తే పరలోకంలో సౌఖ్యాలు కలుగుతాయని నమ్మకం.

సంగమేశ్వర క్షేత్రంలో పూర్వం మాఘబహుళ చతుర్దశి నుండి ఫాల్గుణ శుద్ధ విదియ వరకు ఐదురోజులు రాత్రి సందర్భాన తిరునాళ రథోత్సవం జరిగేది. శ్రీశైలం ప్రాజెక్టువల్ల ముంపుకు గురికావటం వల్ల ఈ క్షేత్రంలోని ఆలయాలు తరలించి మరోచోట పెట్టబడినవి. ఇక్కడ కార్తీకంలో కూడా పూర్వం విశేష పూజాదికాలు నిర్వహించబడేవి.

కాశీ – రామేశ్వరం జాతీయ రహదారి పూర్వం ఉండేది. ఆ దారిగుండా ప్రయాణించే యాత్రికులు తప్పక సంగమేశ్వర క్షేత్రాన్ని సందర్శించేవారు. జిల్లాలోని శైవక్షేత్రాలలో ఇది ప్రముఖమైన వాటిలో ఒకటిగా పూర్వం నుంచి ప్రసిద్ధి పొందింది.

కృష్ణానదీ పుష్కరాల సందర్భాన ఇక్కడ వేలసంఖ్యలో భక్తులు స్నానాదికాలు నిర్వహించేవారు. దానికి ప్రధాన కారణం అది సప్తపదీ సంగమ తీర్థస్నానం కావటం మూలాన ఫలం అధికంగా కలుగుతుందనే విశ్వాసమే.



ఒకరోజు పార్వతీపరమేశ్వరులు అరణ్యవాసుడైన భార్గవకుమారుణ్ణి చూచి, ఆ మునిదగ్గరికి వెళ్లి, సవినయంగా "నేను చంద్రశేఖరుణ్ణి. నీ వాలకం చూచి మెచ్చు కొంటున్నాను. నీకు ఒక వరమివ్వాలనిపి స్తూంది. అడుగు" అన్నాడు. భక్తిసారుడు కళ్ళు తెరిచాడు. పార్వతీనాథుని కేసి చూశాడు.

"ఆహా! నాకు వరమిస్తారా?" సరే!

"ఇదిగో చూశారా ఈ బొంత! ఈ బొంతను కుడుతున్నాను. మీరు రావడంతో కుట్టేపని ఆపాను. ఈలోగా సూదినుండి దారం జారిపోయింది. అంచేత ఈ సూది బెజ్జంలో మరల దారమెక్కించండి. ఈ చిన్నపని చేసిపెడితే చాలు'-మీరు దేవతలే కదా' అన్నాడు.

ఈ మాట వినేసరికి శివుడు మండి పడ్డాడు.

'ఔరా! ఏమిటీ పరిహాసం? ఎవరితో ఈ సంభాషణం? ఎవరనుకొంటున్నావు? త్రిపురాలను బూడిద చేసినవాణ్ణి. తారకా సురుణ్ణి అణచడం నీకు తెలియదా? నీకు నా కథలు తెలియకపోవచ్చు గానీ భూలోకానికంతా విదితం. పాతకథలెం దుకు? నీవు తపోధనుడవైతే నాముందు కదలక నిలబడు" అంటూ తృతీయనేత్రం ప్రజ్వలించాడు. ఇంకేం? ప్రకృతిలో పెను మార్పు.

మింట మంటలు. తారకలు ప్రకాశ హీనమయ్యాయి. కొండలు కూలివాలాయి. చిటచిట ధ్వనులతో బ్రహ్మాండభాండమంతా అగ్నిజ్వాలలు వ్యాపించాయి.

యోగివరుడు సామాన్యుడా! తక్కువ తిన్నవాడా? రౌద్రరూపంతో లోకాలను భస్మంచేయడానికి సిద్ధమైన శివుణ్ణి ఎది రించడానికే సిద్ధమయ్యాడు.

ఆలస్యం చేయకుండా రుద్రుని నేత్రాగ్నికి అడ్డంగా తన కుడికాలు చాచాడు. ఆ పాదంలో కోటిలోచనాలు కనబడ్డాయి. చెలరేగే మంటలు కనబడ్డాయి. నిప్పులు వెదజల్లే జ్వాలలు కనిపించాయి. ఆకాశంలోని నక్షత్రాలు పేలాలుగా రాలిపోయేలా భయంకరమైన అగ్నిచ్ఛటలు కనిపించాయి. అంతే!

గరళకంఠుడు వెనకడుగు వేశాడు. ఒకరిని భయపెట్టడానికి సిద్ధమై తానే భయ పడ్డట్టయింది. నీలగళుడు భయభ్రాంతు డయ్యాడు. ఇక లాభంలేదని హరుడు వానలు కురిపించాడు. బోరున వర్షం కురవసాగింది.

ఉరుములతో, పిడుగులతో వాతావరణమంతా మారిపోయింది.

మౌనినాథుడు చూస్తున్నాడు. అతనిలో చలనం లేదు. దేవేంద్రుడు కురిపించిన వర్షానికి ఏమాత్రం భయపడక గోవర్ధనాన్ని ఎత్తిన గోపాలకునిలా కనిపిస్తున్నాడు.

శివుడు ఆశ్చర్యపడ్డాడు. తన దేవేరిని చూచి, 'శర్వాణి! చూశావా! నేను తృతీయ నేత్రాగ్ని' ప్రజ్వలింపజేస్తే ఈ మౌని ప్రతిగా మరోమంట కల్పించాడు. అతనిముందు నేనెంత? శ్రీనాథుని భక్తులే అధికులు. వారికి భూసురులు సాటిరారు. నరనాథులు సరి పోరు. కిన్నరనాథులు దిగదుడుపే. హరిదాసులే అధికులు. వారితో ఢీకొనడం సరికాదు. అయినా ఒక సంఘటన చెబుతాను విను. అంబరీషుణ్ణి హింసించాలని-అత్రిసుతుడైన దుర్వాసుడు భంగపడ్డాడు. హరిదాసుల జోలికిపోవడం పొరబాటు. అది తగని పని. వారు అఖిలలోకైకపావనులు. అహంకారం లేనివారు. అధికులకు అధికులు' అని చెప్పాడు.








ఆ తరువాత మునీశ్వరుణ్ణి చూచి 'యోగీంద్రచంద్ర! నీ మహామహిమను వర్ణించడం సాధ్యమా? నిన్ను, నీ శక్తిని, నీ యోగనిష్ఠను తక్కువ చేసి, నా ఆధిక్యం చూపడం నా తప్పేమరి. మా తప్పిదాలను క్షమించు' అంటూ పార్వతితో శివుడు నంది వాహన మెక్కి కైలాసానికి వెళ్ళిపోయాడు.

భక్తిసారునిపాదంలో కళ్లుండడంవల్ల అతనికి అక్షపాదు డనే పేరు ప్రచారమైంది. శివపార్వతులు వెళ్ళిపోయాక యోగి తనపనిలో తాను నిమగ్నమయ్యాడు.

మాయ అనే దారాన్ని గుచ్చి, కాలమనే సూదితో జీవుల శరీరాలనే చీకిబొంతలు కుట్టే పరాత్పరుడైన మాధవునిలాగా మౌని బొంతలను సూదితో కుడుతున్నాడు. ఆ సందర్భంలో ఆకాశమార్గంలో 'కొంకణుడనే' సిద్ధుడు బెబ్బులివాహనంమీద వెళుతున్నాడు. అతడు మంత్రసిద్ధుడు. చిరుతకెంజడలవాడు. శరత్కాలంలోని మేఘంలాంటివాడు. అతనివాహనం యోగి ఆశ్రమం దాటి వెళ్ళలేకపోయింది. సిద్ధుడు అదలించాడు. లాభం లేదు. ముందుకు కదలడం మాని, వెనకడుగు వేయ సాగింది. సిద్ధుడు ఆశ్చర్యపడ్డాడు.

ఎవరైనా దారికి అడ్డం వస్తున్నారేమో అనుకొన్నాడు. లేదా ఎవరైనా వాకట్టు చేశారేమో అని దిగాలు పడ్డాడు. చివరకు భూతలంకేసి చూచి, ఇక్కడేదో మహిమ ఉందని కిందికి దిగి మునీంద్రుణ్ణి చూచాడు.

"యోగీంద్ర! నిగమాంతరంగ! భాగవతోత్తమాంస! అప రాధం. అపరాధం. నన్ను క్షమించు. మహిమాన్వితులైన మీరు సూది చేతబట్టి బొంత కుట్టడమేమిటి? సిద్ధపురుషులైన మీరు ఈ నీచకార్యం చేయడమేమిటి? ఇదేమీ బాగాలేదు. నా అప రాధ క్షమాపణార్థం మీకు రసగుళిక ఇస్తున్నాను. స్వీకరించండి' అంటూ అందివ్వ బోయాడు. భార్గవాత్మజుడు చిరునవ్వుతో

'ఇదేం ఫలం? ఈ పండువల్ల ప్రయోజనాలేమిటి? నీవెలా సంపాదించావ్? నాకు సవిస్తరంగా చెప్పవయ్యా' అన్నాడు.

"మునీంద్రా! అణిమాదిసిద్ధులు కైవసం కావడంవల్ల ఈ ఫలం సంపాదించాను. ఈ గుళికతో ఇనుమును బంగారం చేయవచ్చు. ఇది రసగుళిక' అన్నాడు.

మౌని సాంతం శాంతంగా విన్నాడు.

తన కాలికంటుకున్న మట్టిని దులిపాడు. ఆ మట్టితో గుళికను తయారుచేశాడు. అంతేకాదు ఆ గుళికను సిద్ధుని కిచ్చాడు. 'సిద్ధపురుషా! ఇదిగో ఈ గుళిక నీవు తీసుకో. ఈ గుళికతో మట్టిని బంగారం చేయొచ్చు. ఈ గుళిక ధరించినట్ట యితే అనుకొన్న పనులు ఆటంకాలు లేక నెరవేరుతాయి. ఈ గుళికకు సాటి మరోటి లేదు. అయినా నీవు సంపాదించిన గుళికకోసం ఎన్నిబాధలు పడ్డావో? ఆలోచించు. నొప్పులు పుట్టే కాళ్ళపై నడచావు. దుర్గమారణ్యాలలో తిరిగావు. శ్రమకోర్చి ఎన్నో చోట్ల నేల త్రవ్వావు. పొదులు సేకరించావు. పుటం పెట్టావు. ఆలాంటి ఘుటికతో బంగారం చేయడంలో వింతే మిటి?

నేనిచ్చే గుళిక తీసుకో? ఆయుష్మంతుడవవుతావు. మరణం నీ దరిదాపులకు రాదు. దైవత్వం అనాయాసంగా సిద్ధిస్తుంది. మానినీమణుల్ని ఆకర్షించేలా మన్మథాకారం అబ్బుతుంది. అంతే కాదు- బ్రహ్మ ఇంద్రాదులు పొగిడేలా ఉచ్చస్థితి అందుకొంటావు. సమస్తలోకాలు నీకు వశమవుతాయి. అఖిలలోకవంద్యుడైన సిద్ధవరుడవుతావు. సిరివరదాసు లిచ్చేవే గొప్పవి. వాటికి సాటి మరోటి లేదు. అయినా నీతో మాటలు పెంచడమెందుకు? అని గుళిక ఇచ్చాడు-ముక్తీంద్రుడు. కొంకణుడు తలవంచాడు.

పరమార్థమేదో అతనికి బోధపడింది. మునిముందు తల వంచాడు.

యోగిపతికి నమస్కరించి, బెబ్బులి వాహనమెక్కి వెళ్ళి పోయాడు. అయినా అతనిలో ఒక సందేహం.

ముని ఇచ్చిన గుళిక ప్రభావం తెలుసుకోవాలనే ఆరాటం. అందుకే ఒకచోట ఆగాడు. శార్దూలవాహనం దిగాడు. చిత్ర కూటపర్వతం చూచాడు. తన చేతిలోని గుళికను ఆ పర్వత శిలలకు ఆనించాడు.

ఇంకేం? ఆ కొండ కనకపర్వతమైంది.

కొంకణుడు ఆశ్చర్యపోయాడు.

ఈ బంగారుపర్వతాన్ని ఇక్కడే ఉంచితే లోకంలో క్రయ విక్రయాలు ఆగిపోతాయి. యాగాదులలో, దానాదులలో, భోగాదుల ప్రకటనలో వాడుకోదగ్గ, ప్రదర్శించుకోదగ్గ బంగారం ఇతరలోహాదులతో సమానమైపోతుంది. ఇది సరికాదు. తగదు' అనుకొన్నాడు.

కొంకణుడు తన యోగశక్తితో భూమిలో ఒక పెద్దగుంత ఏర్పడేలా చేశాడు. కనకపర్వతంగా కనిపించే ఆ కొండను ఆ గోతిలో పడేలా చేశాడు. ఆ తర్వాత మరల మునిదగ్గరకి వెళ్ళాడు. పాదాలపై వాలాడు. నోరార నుతించాడు.

'స్వామి! శ్రీరామునిపాదధూళితో శిల స్త్రీ అయిందని ఎప్పుడో విన్నాను. కానీ నీ పాదరజంతో తయారయిన గుళికతో కొండ బంగారం కావడం ప్రత్యక్షంగా చూచాను. మీ మహి మల్ని పొగడడం నాచేత కాదు. నా పదివేల తప్పుల్ని క్షమిం చండి' అంటూ సెలవు తీసుకొని, ఆకాశమార్గాన కదలి వెళ్ళి పోయాడు.

యోగీశ్వరుడు ఒక గుహలో ప్రవేశించి, ఏకాంతంగా ఉంటూ తపస్సు చేసుకొంటూ కాలం గడుపుతున్నాడు. ఆ సమయంలో ముదల్ ఆళ్వార్లు సరోయోగి, భూతయోగి మహా యోగులు తీర్థయాత్రలు చేస్తూ యాదృచ్ఛికంగా భక్తిసారుడు తపస్సు చేసుకొంటున్న ఆ ప్రాంతానికి వచ్చారు. అపూర్వమైన తేజోరాశి అక్కడ ఆవరించి ఉండడం చూశారు.

యోగదృష్టితో ఆ ప్రాంతంలో 'భార్గవమునితేజం' ఉండడం గుర్తించారు. ఆ ముగ్గురు ఆళ్వారులలో ఇద్దరు 'భార్గవావాసానికి సూర్యచంద్రుల్లాగా ప్రదక్షిణం చేసుకొని వెళ్ళి పోయారు.

సరోయోగీంద్రులొకరు మిగిలారు.

'ఓహో! ఇక్కడే భక్తిసారులున్నారు. ఆతడు యోగి. అతణ్ణి దర్శించి, నుతించి వెళ్ళడం సబబు' అంటూ దగ్గరికి వెళ్ళారు. యోగీంద్రులు సరోయోగీంద్రులను గుర్తించారు.

ఆత్మబంధువులు కలుసుకొన్నట్టుగా ఆనందించారు. వారికంట చంద్రకిరణాలలాగా ఆనందాశ్రవులు రాలసాగాయి. ఒకరినొకరు పాదనమస్కారాలు చేసుకొన్నారు. ఆలింగనం చేసు కొన్నారు. చేతులు చేతులూ కలిపారు. ఇద్దరు కుశలప్రశ్నలు వేసుకొన్నారు. పాలు– నీరులాగా అక్కడే కొంతకాలమున్నారు.

ఆపై ఆ తాపసులు కొండలూ, నదులు, అరణ్యాలు దాటి మయూరపురి చేరుకొన్నారు. అక్కడే కైరవతీర్థందగ్గర కేసర భూజంనీడలో యోగానుష్ఠానం చేస్తూ చాలాకాలమున్నారు. ఎంతసేపూ వారికి 'పరతత్త్వజ్ఞానానుభవమే'!

ఒకరోజు సరోయోగి భక్తిసారులతో 'మునివర్యా! అర మరికలు లేకుండా ఇంతకాలం అంతరంగాలు కలిసినట్టు జోడు కోడెలులాగా కూడి యాడి గడిపాము. అన్నదమ్ముల్లా మెలగి నాము. ఒక్కక్షణంలాగా కాలం గడచింది. నాకు సెలవిప్పిం చండి. ఈ భూభాగంలోని ప్రసిద్ధతీర్థాలను ఆలాగే ఆతీర్థాల పరిసరాలలో సాక్షాత్కరించిన అర్చావతారమూర్తుల్ని సేవించి మరల వస్తాను' అంటూ కదలారు.

అక్షపాదుడైన భక్తిసారుడు కొంతకాలం మయూరపురిలోనే యోగాభ్యాసం చేస్తూ కాలక్షేపం చేయసాగారు.

ఒకరోజు పవిత్రస్నానం చేసిన భక్తిసారుడు నొసట పుండ్ర ధారణకు సిద్ధమయ్యాడు. కాని 'తిరుమణి' లేదు. తిరుమణి లేకుండ జపతపాదులు చేయకూడదని నియమం. ఇక్కడ తిరు మణి లేదు. ఇది కృష్ణధారుణి. ఏం చేయాలో తోచక యోగ నిద్రలో మునిగారు.

ఆ నిద్రలో శ్రీ వేంకటేశ్వరుడు స్వప్నంలో సాక్షాత్కరించి, చేతులతో నిమిరి, ఆయాసం పోగొట్టి, లాలించి ప్రేమతో 'యోగి వర్యా! అదిగో కొలను. ఆ కొలనులో 'తిరుమణ్' ఉంది. ఈ మణ్ అందరికీ దొరికేది గాదు. ఇంద్రాదులకుకూడా అలభ్యం. ఆమణ్ అణువంత ధరించినా చాలు – దేవతలకూ అందని భాగ్యాలు అలవోకగా అనుభవిస్తారు. వెళ్ళు. ఆ తిరుమణ్ స్వీకరించు' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

భక్తిసారుడు ఒక్కసారిగా తటుక్కున లేచి 'కరిరాజపాలక! కమలాక్ష! రమానాథ! వాత్సల్యజలధి! నను కన్న తండ్రి! అంగజ జనకా!' అంటూ కొలనులో దిగాడు. జలమధ్యభాగంలో నిండుచంద్రుని తేజోరాశిలాంటి తిరుమణిని చూచి, ఆశ్చర్యపడి భక్తిశ్రద్ధలతో ఆ 'మణ్' తీరానికి తెచ్చుకొన్నాడు.

తదనంతరం ఒక చెట్టునీడన పద్మాసనం వేసుకొని, కేశ వాదినామాలు జపిస్తూ ఊర్ధ్వపుండ్రాలు ధరించారు. కొంత కాలం అక్కడేవుండి కాంచీనగరంకేసి పయనం సాగించారు.

ఆ కాంచీపురంలో శేషతల్పంలోని లక్ష్మీకళత్రుణ్ణి కనులార సేవించి, నోరార కీర్తించి, అక్కడే యోగవిద్యాసక్తితో కాలం గడపసాగారు. భక్తిసారుని మహిమలు నలుదిక్కుల ప్రాకాయి. ఆ యోగి యోగానికి ప్రజలు ఆశ్చర్యపడ్డారు. అతణ్ణి దర్శించ డమే, సేవించడమే పరమార్థంగా అక్కడివారు భావించసాగారు. భక్తిసారుల వృత్తాంతం ఆనోట ఈ నోట విన్న కణికృష్ణుడు ఆ యోగిదగ్గరికి వచ్చాడు.

తల్లిని చూచిన బిడ్డలాగా ఆనందంతో దగ్గరికి వెళ్ళాడు. ఆనందబాష్పాలతో భక్తిసారుల అడుగులు తడిపాడు.

"స్వామీ! పూర్వజన్మసుకృతంవల్లనే మీ దర్శనభాగ్యం కలిగింది. నేను ధన్యుణ్ణి. మొక్కబోయిన దేవుడు ఎదురొచ్చినట్టు మీరు తారసిల్లారు. ఏ ఉపాయంతో బ్రహ్మేంద్రాదిదేవతలు సేవిం చారో తెలియదుగానీ వారికి దక్కని భాగ్యం నాకు దక్కింది.

మీ అనుగ్రహంతోనే దృఢవ్రతునికి కొడుకునయ్యాను. నన్ను కణికృష్ణుడంటారు. నేను మీ సేవకుణ్ణి. నా పాలిట దైవం మీరే!' అంటూ సాగిలబడ్డాడు. భక్తిసారుడు కణికృష్ణుణ్ణి సాదరంగా దగ్గరికి తీసుకొన్నారు. 'ఈతనివల్ల కాగల లోకోత్తర కార్యమొక టుంది' అని నిర్ణయించుకొని, కణికృష్ణుని దగ్గరి కొలనులో స్నానం చేయించి, తనముందు కూర్చుండ చేసి, అతనిచెవిలో 'పరమయోగాన్ని' ఉపదేశించారు.

ఆ శిష్యుడు జ్ఞానభక్తివైరాగ్యాదిసద్గుణాలు కారణంగా గురువును మించిన శిష్యుడయ్యాడు. కణికృష్ణుడు తన్ను సేవి స్తుండగా భక్తిసారులవారు గిరిగుహాంతరసీమలో ఆసీనులై, యోగంతో పరబ్రహ్మ సాక్షాత్కారం పొంది బ్రహ్మానందంతో ఒళ్ళు మరచి రోజులు గడపసాగారు.

భక్తిసారమునుల దివ్యమహిమలను, భగవద్భక్తిని విన్న ఒక ముసలిది భక్తిసారులు వాసంచేసే గుహముంగిట రోజూ శుభ్రం చేసి, ముగ్గులతో అలంకరించేది. స్వామి దేవపూజకు అవసర మైన పత్రపుష్పాలను సమకూర్చేది. ఈ విధంగా చాలరోజులు గడిచాయి.

యోగి తనయోగంతో ముదుసలి పరిచర్యలను చూశారు. ఆమెను అనుగ్రహించాలనుకొన్నారు. 'అమ్మా! నీ భక్తి సాటి లేనిది. నీవేది కోరుకొంటావో కోరుకో! నేను తప్పక అను గ్రహిస్తాను. నీవడిగేది అసాధ్యమైనా తప్పక నీ కోరిక నెరవేరు స్తాను' అన్నారు.

ముసలిది చేతులు జోడించి, 'స్వామీ! ఏమని చెప్పను? శారీరక మానసిక బలానికి విరోధి, పసిమితనానికి శత్రువు, లావణ్యాలకు కొఱవి, నీటుదనానికి మరణశాసనం, అందమైన రూపానికి రోత, భోగాదులకు వీడుకోలు, నవ్వులాటలకు నిలయ మైన ముసలితనం వచ్చింది. ఈ ముదిమిపోయేలా లలితరూప వయోవిలాసాలు జిగేలు మనేటట్లుగా అనుగ్రహించండి. ఇదే నా కోరిక' అంది.

మౌనిచంద్రులవారు ఆలోచించారు.

ఆ వృద్ధస్త్రీ చేసిన సేవలు గుర్తుకు వచ్చాయి. ఆవిడవల్ల భవిష్యత్తులో కాగల పరిణామాలు గోచరించాయి.

మౌనిచంద్రులు ప్రసన్నులయ్యారు.

ఆమెపై అనుపమకరుణాకటాక్షవీక్షణాలు ప్రసరింపజేశారు. ఆ సంవీక్షణం ఆమె ఆకారంలో పసిమి మిసిమిని నింపింది. కృష్ణుని పాదరజంతో కుబ్జ సుందరి అయినట్లుగా ఆ ముదుసలి దేహం సర్వాంగసుందరమైంది.

రంభ, తిలోత్తమ, మంజుఘోష, చిత్రరేఖలా కనిపించ సాగింది. బెళుకుకన్నులు, కులుకుగుబ్బలు నవ్వుమోము, మెదిలే వేణి, ఊగాడే నడుము, మెరిసే దేహపు వంపులు, చిగురుచాయ పాదాలతో జగ న్మోహనాంగిగా మారింది.



యోగీంద్రులపాదాలపై వాలింది. 'స్వామీ! నేను కలగనని అనుగ్రహం ఇది. మీ మహిమలు అనంతం. వర్ణనాతీతం' అని దండం పెట్టింది.

భక్తిసారులు ఆ జవ్వనికేసి చూస్తూ 'నా ప్రసాదంవల్ల ఇంకా నిరుపమసంపదలు నీకు అబ్బనున్నాయి. పుట్టపురాణులకు పట్టబద్ధకామినులకు లభించే పరిచారాలు నీకు లభిస్తాయి. అయినా ఒకమాట చెబు తాను. ఏనాడూ నీ మానసంలో మా ధ్యానం మఱవకు' అని హితబోధ చేశారు.

ఆ జవ్వని స్వామిఅనుజ్ఞతో తన ఇంటికి వెళ్ళిపోయింది. *(ఇంకా ఉంది)*




# శ్రీకృష్ణదేవరాయలు - అల్లసానిపెద్దన

- శ్రీ కట్టా నరసింహులు, 94413 37542

శ్రీకృష్ణదేవరాయలు విశాలమైన భూభాగాన్ని పరిపాలించినా 'రాయలసీమ' అనేపేరు కొన్ని జిల్లాలకు మాత్రమే పరిమితమైంది. ఎన్నిజిల్లాల్లో, కృష్ణవేణి ప్రవహించినా ఒక్క జిల్లానుమాత్రమే 'కృష్ణాజిల్లా' అన్నారు. కృష్ణను అప్యాయంగా, పవిత్రంగా కృష్ణవేణీ! అని పిలుస్తారు.

ఈ కృష్ణశబ్దంతోనే ఒక చక్రవర్తిని పిలుస్తున్నాం. ఆయనే విజయనగరానికి చక్రవర్తిగా, ప్రజలకు స్వర్ణయుగాన్ని ప్రసాదించిన శ్రీకృష్ణదేవరాయలు. కవిలోకానికీ ఆయన చక్రవర్తి అయ్యారు. కవుల్ని పోషించారు. స్వయంగా ప్రౌఢరచనలు చేశారు. ఆముక్తమాల్యదను సాహిత్య ప్రపంచంలో సుప్రతిష్ఠితం చేశారు. ఆముక్తమాల్యద వైష్ణవ కథలసంపుటి అయినా ఏకసూత్రత ఉన్న మహాకావ్యం. ఈ ప్రబంధకావ్యాన్ని ఏడుకొండల వేలుపు 'వేంకట భర్త'కు అంకితమిచ్చారు- శ్రీకృష్ణరాయలు.

ఆముక్తమాల్యద రచనకు ప్రేరణ కలిగినచోటు కృష్ణా జిల్లాలోని శ్రీకాకుళాంధ్రదేవునిఆలయం. శ్రీకృష్ణదేవరాయలు తన దండయాత్రల సమయంలో పలుమార్లు కృష్ణానదిని దర్శించారు.

కృష్ణాతీరంలోని విజయవాడలో కొన్నినాళ్లు గడిపారు. ఆ గడిపిననాళ్లలో గజపతుల మీదికి దాడి వెడలిన సమయంలో శ్రీకాకుళాంధ్రదేవుని దర్శించాలని సంకల్పించారు. విజయవాడకు అల్లంతదూరంలో కృష్ణకు కాస్తంత సమీపంలో ఉన్న శ్రీకాకుళంలో ఆంధ్రదేవుడు కొలువై ఉన్నాడు. క్రీ.శ.1518 ఫిబ్రవరి 16 (క్రీ.శ.1440 బహు ధాన్య, ఫాల్గున శుద్ధ శుక్రవారం కుంభసంక్రమణం) తేదీన దర్శనం చేసుకొన్నారు. ఆ రాత్రి అక్కడ శయనించారు. ఆ సమయంలో కలగన్నాడు-రాయలు. ఆకలలో ఆంధ్రదేవుడు దర్శనమిచ్చారు. ఆముక్తమాల్యదను రచించమన్నాడు.

ఆంధ్రదేవునికోరికను రాయలు తలదాల్చాడు. తెలుగు భాషకు అమూల్యమైన కానుక లభించింది. అలా ఆముక్తమాల్యదకు కృష్ణవేణీపరిసరాల్లో అంకురారోపణం జరిగింది. శ్రీకాకుళం గుడిలో రాయలవారు వేయించిన శాసనం, ఆముక్తమాల్యదలోని పీఠిక ఈ విషయం తెలియజేస్తున్నాయి.

కృష్ణానది ప్రసక్తి వచ్చినపుడు రాయలవారి ఆస్థానంలో పెద్దపీట వేయించుకొన్న ఆంధ్రకవితాపితామహుడు అల్లసాని పెద్దన గుర్తుకు వస్తారు. ఈయన మనుచరిత్రప్రబంధం రచించి రాయలకు అంకితమిచ్చారు. గండపెండేరం, గజారోహణంవంటి సత్కారాలు అందుకొన్నారు. అనేకఅగ్రహారాలతోపాటు కోకటం గ్రామాన్ని అడిగి పుచ్చుకొన్నారు. కోకటం ఆయన స్వస్థలం. చౌడూరు గ్రామాలు కడపకు ఎగువగా పెన్న ఒడ్డు మీదే ఉన్నాయి. పెద్దన రాయలవారికి గురుతుల్యుడు. రాయలవారిదృష్టిలో పెరియాళ్వారుస్థాయిని సంపాదించుకొన్నాడు - పెద్దన.

## నీకిదే స్వాగతమ్ము!

సీ. పడమటికనుమలు ప్రసవించ పయనించి
ఘనమహారాష్ట్రంపు గడపదాటి,
ఇలతెల్గునేలపై నిలిచిన యంతనే
వెయ్యేనుగులశక్తి వెల్లివిరియ
నందికొండకు నేగి వందనా లర్పించి
యల నమరావతి నాదరించి,
విజయవాడను తాకి విజయాలు సాధించి,
ఘనచరిత్రపుసృష్టి ఘనత కెక్కి

సమధికోత్సాహి వగుచును సాగిపోయి,
సాగరుని జేరు నీకిదే స్వాగతమ్ము!
తాండవించెను నీజన్మ నిండుతృప్తి
కృష్ణవేణి! పుష్కరపుణ్యశ్రేణివమ్మ!

– రావూరి ఏకాంబరకవి

గోదాదేవితండ్రి పెరియాళ్వారు. రంగనాథునికి పరమ వైష్ణవదాసుడై పన్నిద్దరుఆళ్వారుల్లో ఒకడుగా నిలిచిన వాడు పెరియాళ్వారు. తమిళంలో 'పెరియ'కు తెలుగులో సమాన మైన పదం 'పెద్ద'.

రాయలవారి వెంట కదనరంగాలకు వెళ్తూ వచ్చిన పెద్దనాదికవులు ఆ యా చోట్ల కవనరంగాలూ నిర్వహించే వారు. పెద్దనకు కృష్ణవేణీనదిపట్ల అభిమానమే. నందవరీ కుడైనా, అహోబిలంలో విద్యాభ్యాసం చేసినా, పెద్దన్న శైవాన్నీ అభిమానించాడు. 'అంకము జేరి' శైలతనయాస్తన దుగ్ధములాను వేళ, అంటూ మనుచరిత్రలో అబ్బురపరిచే వినా యకస్తుతి చేశారు. పెద్దన తన కోకటం అగ్రహారంలో వెలసి ఉన్న సకలేశ్వరునికి పొలం సమర్పించాలనుకొన్నాడు. అందు కోసం మరోస్వామి సన్నిధి ఎంచుకొన్నాడు. ఆ సన్నిధి విజయవాడలోని మల్లికార్జునునిగుడి. పెద్దన కోకటం నుంచి విజయవాడకు వెళ్లారు. కృష్ణానదీపవిత్రజలాల్లో స్నానం చేసి, మల్లికార్జునుని సన్నిధిలో సకలేశ్వరునికి పొలం సమర్పించుకొన్నారు. స్వామి నైవేద్యంకోసం పుట్టెడు నేల, దీపారాధనకోసం పుట్టెడునేల, పుట్టెడునేల అంటె ఎంత నుకున్నారు! పుట్టెడు ధాన్యం ఎంత నేలలో విత్తుతారో అంత నేల అన్నమాట. ఇప్పటి మూడుకిలోల ధాన్యం రెండు కొలతశేర్లు అవుతుంది. కోకటం ప్రాంతంలో 500 శేర్లు ఒకపుట్టి. ఈ లెక్కన తన పొలాన్ని స్వామికి సమర్పించు కొన్నారు–పెద్దన.

ఇందుకు సంబంధించిన శాసనం కోకటంలోని సకలేశ్వరఆలయంలో ఉంది. కాలం శాలివాహనశకం 1440. బహుధాన్య సంవత్సరం. వైశాఖశుద్ధ పూర్ణిమ అంటే క్రీ.శ. 1518 ఏప్రిల్ 25వ తేదిన అవుతుంది. పెద్దన కృష్ణ ఒడ్డున మల్లికార్జునసన్నిధిలో ధారాపూర్వకంగా సమర్పించి, శాసనం కోకటంలో నిలిపారు.

కృషవేణిలోని కృష్ణ విష్ణుస్వరూపం. వేణి శివ స్వరూపం. రెండునదులు ఒక్కటై కృష్ణవేణి అయింది. కృష్ణవేణి నది హరిహరస్వరూపంగా నిలుస్తూ ఉంది. అలాగే శైవ వైష్ణవాలు అభేదంగా వెలుగొందిన కాలం రాయల నాటిది. శ్రీకృష్ణరాయలు అల్లసానిపెద్దనలు మతసహనం పాటించి నందుకు సజీవసాక్ష్యం కృష్ణవేణి.



### వైకుంఠపాళి
### :: 09 – సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 ర | | 2 కే | 3 శి | ధ్వ | 4 జు | డు | |
| | 5 జ | ర | | వ | | ఫా | | 6 అం |
| 7 శ | ని | | 8 వి | రా | ళి | | 9 కం | బు |
| ర | | 10 రా | | త్రి | | 11 అ | | జో |
| 12 న్న | అ | దా | త | | 13 స | త్యం | వ | ద |
| వ | | రి | | 14 కౌ | | గ | | రు |
| 15 రా | గి | | 16 ప | స్తు | లు | | 17 క | డు |
| త్రి | | 18 గా | | భ | | 19 మం | ద్రు | |
| | 20 వ | ధ | | 21 ము | ది | | వ | |

# కృష్ణమ్మ... ఎన్ని విశేషాలమ్మా!!

- డా॥ పి.వి.రంగనాయకులు, 97017 93210

**తుంగభద్ర -కృష్ణనదులు సంగమప్రదేశం నుండి కృష్ణాజిల్లాలోని పరిటాల, గుంటూరు ప్రాంతం కొల్లూరు వరకు కల 300 కి.మీ. కృష్ణానదిని వజ్రాలనది అంటారు. ఆ ప్రాంతపుమట్టి రత్నాలమయం. తుంగభద్ర ఉత్తరతీరం నుండి విస్తరించిన రాయచూర్ ప్రాంతం కూడ వజ్రాలకు పెట్టింది పేరు. భారతావనికి వజ్రహారంలా ప్రకాశించే కృష్ణమ్మలోని ఎన్నో విశేషాలకు చిత్రిక పట్టిన వ్యాసం ఇది!**

## కృష్ణలోయలోనే ఆలయాల ఆవిర్భావం

'ప్లెయిస్టోసీన్' యుగంలోనే అనగా 20 లక్షలు సంవత్సరాల క్రితం ఏర్పడిన కన్నాబెన్న లేదా కృష్ణవేణీ నిరంతరం పశ్చిమ కనుమలకు తూర్పు సుముద్రానికి వారధిగా నిలుస్తూ, తన పరిసరాల్లో మానవనాగరికతకు జన్మస్థలం అయింది. హైందవఆలయాలు శాతవాహనుల పాలన అనంతరం ఆంధ్రదేశాన్ని పరిపాలించిన ఇక్ష్వాకుసామ్రాజ్య పాలకుల కాలంలో రూపుదిద్దుకున్నాయి.

నేడు మనం చూస్తున్న వైష్ణవ, శైవ ఆలయాలు ఎలా ప్రారంభమయ్యాయో తెలుసుకోవాలంటే కృష్ణనదీ పరిసరాలే మనకు సమాధానాలు చూపిస్తున్నాయి. క్రీ.శ. 3వ శతాబ్దంలో విజయపురి (నేటి నాగార్జునసాగర్ ప్రాంతం) రాజధానిగా ఏలిన ఇక్ష్వాకులు పూర్వం అయోధ్య నేలిన శ్రీరాముని వంశస్థులేనని చరిత్రకారుల అభిప్రాయం. వీరిలో వశిష్ఠీపుత్ర చాంతమూల, వీర పురుషదత్తుడు, ప్రముఖులు.

**కృష్ణనదికి అభిముఖంగా సింహగిరి. సింహాన్ని పోలిన ఈ కొండ ఎందరో స్తపతులను, ఆలయ నిర్మాణకారులను ఉత్తేజపరచింది.**



శైవ, వైష్ణవాలయాలలో అత్యంత ప్రాచీనమైనవి. మార్గదర్శకంగా నిలిచిన ఆది ఆలయాలు కృష్ణాపరిసరాల్లో కనుగొనటం జరిగింది. వీటి పునాదులు మాత్రం లభించినప్పటికీ ఆలయాల నిర్మాణం పూర్తిగా అవగతమైంది. నాగార్జున లోయలో బయటపడిన 12 ఆలయాలలో 5 శివ, కార్తికేయ ఆలయాలు. విహువలచాంతయూలకాలంలో నిర్మించబడిన ఈ ఆలయాలలో మండపం, ప్రసాదం ఉన్నాయి. ఇతని కుమారుడు, వీర పురుషదత్తుడు నిర్మించిన పుష్పభద్రాలయంలో మొదటసారిగా ధ్వజస్తంభ నిర్మాణం జరిగింది. ఈ ఆలయానికి నాలుగువైపులా ద్వారాలు, ప్రాకారం నిర్మించి ఉన్నాయి. అనగా సమాజంలోని అన్ని వర్గాలవారు అన్ని వైపులనుంచి ఆలయాలలోకి ప్రవేశించవచ్చని సందేశం ఇస్తాయి ఆనాటి ఆలయాలు. క్రీ.శ. 278లో నిర్మించబడిన అష్టభుజనారాయణ ఆలయం నేటి వైష్ణవఆలయాలకు మాతృక అని భావించవచ్చు. సమీపంలోని హారీతి ఆలయానికి ఎదురుగా పుష్కరిణి కూడ ఏర్పాటు చేయబడింది. ఈ ఆలయాలలో అంతరాళం, మండపం మొదలగు నిర్మాణాలను బట్టి అప్పటికీ స్తపతి వృత్తి ప్రారంభమైందనవచ్చు.

ఇక్ష్వాకుల తర్వాత ఆంధ్రప్రాంతాన్నేలిన పల్లవులలో త్రిలోచన పల్లవ క్రీ.శ.5వ శతాబ్దంలో మరిన్ని ఆలయాలు నిర్మించాడు. క్రీ.శ.7వ శతాబ్దంలో పశ్చిమచాళుక్యులు ఆంధ్రప్రాంతాన్ని ఆక్రమించుకుని, వేంగీసామ్రాజ్యాన్ని స్థాపించి, విరివిగా ఆలయనిర్మాణం చేశారు. ఆలయనిర్మాణ పరిణామం కృష్ణానదీ పరిసరాల్లోనే జరిగి తదుపరి దేశమంతా వ్యాప్తించిందని నేటి చరిత్రకారులు పరిశోధించి కనుగొన్నారు. పుష్కరాల సందర్భంగా విజయపురిలోను, సిరిటెన (నేటి శ్రీశైలం) మరియు ధరణికోట (నేటి అమరావతి)లోను ఇక్ష్వాకుల కాలంనుండే వైభవంగా వేడుకలు జరుగుతున్నాయి. ఆలయకళకు మాతృభూమి అయిన కృష్ణవేణి తెలుగు ప్రజలను ఆశీర్వదిస్తూనే ఉంది.

విదేశీయులు భారతదేశానికి కేవలం సుగంధ ద్రవ్యాల కోసం రాలేదు. మిరియాలతో పాటు ఇక్కడి మట్టిలోని మాణిక్యాలు చేజిక్కించుకోవటం కోసం సుదీర్ఘసముద్ర ప్రయాణాలు, ఖండాంతర కాలినడకలు చేశారు. 300 సంవత్సరాల క్రితం దక్షిణ భారతదేశం, ముఖ్యంగా ఆంధ్రప్రాంతమంతా పర్యటించి ఫ్రాన్స్ దేశానికి చెందిన వజ్రాల వ్యాపారి ఎన్నో వజ్రాలను పరిశీలించాడు. గ్రేట్ మొఘల్‌వజ్రం కోడిగుడ్డును సగంగా కోస్తే ఎలా ఉంటుందో ఆ పరిమాణంలో జిగేల్‌మంటూ ఉందని టావెర్నియర్ అన్నాడు. కానీ, ఆ వజ్రం ఇప్పుడెక్కడుందో తెలీదు. అది లభించింది మాత్రం కృష్ణానది సమీపంలోని కొల్లూరు గనుల్లో. అక్కడే లభించిన మరో భారీ వజ్రం కోహినూర్. ప్రస్తుతం ఇది బ్రిటీష్‌రాణి కిరీటంలో ఉంది. ఒర్లాఫ్ వజ్రం ఒకప్పుడు శ్రీరంగంలోని రంగనాథ ఆలయంలో మూల విరాట్ కనుగుడ్డుగా అమర్చారు. అయితే, ఒక ఫ్రెంచి దేశీయుడు భక్తుడిగా చాలా రోజులు నటిస్తూ ఒక రోజు ఆ వజ్రాన్ని తస్కరించి పారిపోయాడు. ప్రస్తుతం ఒర్లాఫ్ వజ్రం రష్యాలో ఉంది. అది దొరికింది పరిటాల–కొల్లూరు ప్రాంతంలోనే ఇక్కడే దొరికిన మరో వజ్రం హోప్. ఇది అమెరికాలో ఉంది. ఇలా ప్రపంచప్రసిద్ధి చెందిన అత్యంత విలువైన పెద్దవజ్రాలన్నీ కృష్ణానది ఒడ్డునే లభించాయి.

**క్రీ.శ.1529లో కృష్ణదేవరాయల మరణం తర్వాత జరిగిన అంతఃపురకుట్రలలో తిరుమలరాయలు తన పతనం తప్పదని తెలిసి హంపిఖజానాలోని వజ్రాలన్నింటినీ గానుగలో తిప్పి పిండి చేసి ఆత్మహత్య చేసుకున్నాడు. అప్పటికి వారిదగ్గర గంపల కొద్దీ వజ్రాలున్నాయి. అవన్నీ కృష్ణానది ప్రవాహఫలితమే. అందుకనే ఈ నది 'వజ్రాలనది' అనే పేరును సార్థకం చేసుకుంది. పశ్చిమకనుమలనుంచి దక్కను పీఠభూమిని కోస్తూ భూగర్భంలో నిక్షిప్తమైన కింబర్లైట్, లాంప్రోఇట్ శిలలను గట్టుకు తోస్తూ మాణిక్యాలను మనకు అందిస్తున్నది కృష్ణమ్మ.**



ఆలయాల చరిత్రను తనలో దాచుకున్న కృష్ణమ్మ. నీటి గర్భంలో ఆలయ అవశేషాలు శాశ్వతంగా ఉన్నాయి.

## ఆయుర్వేదశాస్త్రంలో కృష్ణానది

కృష్ణనదిలో ప్రవహించే నల్లటి చల్లటి నీటికి కూడ ఎన్నో ప్రత్యేకతలున్నాయి. కావేరీ, కృష్ణ నదులు శరీరంలోని వాతాన్ని శమింపజేస్తాయి. పిత్త శ్లేష్మవికారాలను కలిగిస్తాయి. రుచిని పుట్టిస్తాయి. మనోహరంగా ఉండి, సకలమలినాలను నశింపజేసి ప్రాణాన్ని ఉత్తేజపరుస్తాయి. అంతేకాక ప్లీహ రోగాన్ని హరిస్తాయని 'ద్రవ్యరత్నావళి' మొదటిఅధ్యాయంలో చెప్పారు.

ఇతర ఆయుర్వేద గ్రంథాలకు భిన్నంగా 'ద్రవ్యరత్నావళి' గ్రంథం 'జలవర్గం'తో ప్రారంభమై జీవానికి మూలమైన నీటి గురించే మొదటగా చర్చిస్తుంది. నీరు ఐంద్రం (వర్షపు నీరు), పార్థివం (బావులు, తటాకాలు మొ॥వి.) ఫాలం (వృక్షాల నుండి) అని మూడు విధాలైనా మరొక వర్గీకరణలో దివ్యం (అంతరిక్ష–వర్షం), నాదేయం (నదులు) సాముద్రం, కారకం (వడగళ్ళు) మొదలుగా అనేకరకాలను వర్ణిస్తూ నదీజలాన్ని విపులంగా చర్చిస్తుంది. భూమిని చేరిన వర్షపునీరు నదిలో ప్రవహిస్తూ, రాళ్లపై తాడనం చేయబడటం వల్ల శుద్ధి అవుతుంది. రేగడిలో ప్రవహించే నీరు మధురరసాన్ని పొందుతుందని ఆయుర్వేదం గుర్తించింది. అదే విధంగా అనూపదేశం (అనగా నీరు ఎక్కువగా నిలువ ఉన్న ప్రాంతం)లోని జలం దోషయుక్తమని, జాంగల ప్రదేశాల్లోని నీరు ప్రశస్తమైనదని చెప్పబడింది.

కృష్ణ తన ప్రవాహంలో అనేక రకాలైన భూములపై ప్రవహిస్తుండటంతో జలం ప్రాంతాన్ని అనుసరించి తన గుణాలను మార్చుకోవచ్చు. నదీ పరిసరాల్లో పెరిగే చంద్ర, కదలీ, అర్జున, కతక మొదలైన వృక్షవిశేషాలు నీటికి అదనపు రుచిని కలిగిస్తాయి.



శ్రీవత్సవక్షసం శ్రీశం
శ్రీలోలం శ్రీకర గ్రహమ్
శ్రీమంతం శ్రీనిధిం శ్రీద్యం
శ్రీనివాసం భజేఽనిశమ్

07-08-2016
గరుడ పంచమి





18-08-2016 శ్రీ హయగ్రీవ జయంతి



02-08-2016
శ్రీ ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య జయంతి



18-08-2016
శ్రీ విఖనసాచార్యస్వామివారి జయంతి




# శ్రీకృష్ణాలహరి

కృష్ణానదిని గూర్చిన స్తోత్రమే శ్రీకృష్ణాలహరి. కృష్ణావేణి సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుని స్వరూప మనీ, పాపాలన్నీ పోగొట్టి సమస్త శుభాలను కలిగిస్తుందని ఈ స్తుతిలో చెప్పబడింది. అలాంటి కృష్ణాస్నానం చాలా మహిమాన్విత మైనదనీ, ఆ నదీతీరంలో చేయవలసిన తీర్థ విధులూ, ఆచరింపవలసిన వ్రతాలూ, శ్రాద్ధా దులూ ఇందులో చక్కగా వివరింపబడ్డాయి. 'కన్యాయాం కృష్ణవేణీ చ' అన్న వాక్యాన్నిబట్టి పన్నెండేండ్ల కొకమారు గురువు కన్యారాశిలో ప్రవేశించిన తొలి పన్నెండు రోజులు కృష్ణానదికి పుష్కరాలొస్తాయి. ఈ పుష్కరసమయంలో ముక్కోటి దేవతలు, మూడున్నర కోట్లతీర్థాలు కృష్ణను ఆవహించి వుంటాయట. ఆ సందర్భంలో కృష్ణా స్నానం, కృష్ణాతీరంలో చేసిన వ్రతాలు, విధులు మరింత సత్ఫలితాలిస్తాయనడంలో సందేహం లేదు.

సుమారు వందేళ్లకు పూర్వం, సాక్షాత్తు దత్తాత్రేయ స్వరూపులుగా ప్రసిద్ధి పొందిన శ్రీ వాసుదేవానందసరస్వతీ స్వామి (టెంబెస్వామి) వారు ఈ స్తుతిని సంస్కృతంలో వ్రాశారు. వీరు కురుగడ్డి, శ్రీశైలం, అమరావతి, విజయవాడ, మోపిదేవి, పెద్దకళ్లేపల్లి, హంసలదీవి మున్నగు కృష్ణాతీరక్షేత్రాలను దర్శించారు. ఆ సమయంలోనే శ్రీ టెంబేస్వామి కృష్ణాస్తుతిపరమైన 'శ్రీకృష్ణాలహరి'ని చెప్పారు. ప్రముఖ పౌరాణికులు శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి గారు ఈ స్తోత్రానికి విపులమైన వ్యాఖ్య సమకూర్చారు.

ఈ పవిత్ర పుష్కరసమయంలో కృష్ణాయాత్రికులకు, భక్తులకు ఈ 'శ్రీకృష్ణాలహరి'లోని కొన్ని ఖండికలను అందిస్తున్నాం. ఆస్తికులు, ఆధ్యాత్మవిదులు, భక్తులు, యాత్రికులు వీటిని చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాం...

1

**అపి శ్రీకృష్ణే తే మహిమ పరపారం ప్రజతి కో**
**న శేషోఽ శేషాస్యైరపి కథయితుం వా ప్రభవతి,**
**అతో హ్రీతో వాచశ్శుచయ ఇహ వచ్మ్యల్పకమిదం**
**నమః శ్రీకృష్ణే తే జయ శమితతృష్ణే గురుమతే.**

కృష్ అనగా సన్మాత్రమైంది; చిన్మాత్రమైంది. ణకారం నివృత్తిని తెల్పేది. కృష్ణ అనగా సత్యజ్ఞానఆనందస్వరూపమైంది. స్వాభావిక మైన ఐశ్వర్యాది షడ్గుణాలతో శోభించేది కృష్ణానది. అటువంటి ఓ తల్లీ! నీయొక్క ప్రభావాన్ని చివరిదాకా తెలియగలవాడెవడున్నాడు? ఎవ్వనికి అంతుపట్టనిది. బ్రహ్మకు కూడా తెలియతరం కాదు. ప్రళయకాలంలో కూడా తాను లయంకాక మిగులుతాడు గనుక ఆయనకు శేషుడని పేరు. ఆ ఆదిశేషువు వేయిముఖాలతో కూడా నీ మహిమను చెప్పడానికి సమర్థుడుకాడు. ఇట్టి నీ ప్రభావాలు తెలిసి కూడా అసమర్థుడనైన నేను సిగ్గుపడుతూ నా వాక్కు పరి శుద్ధం చేసుకోవడంకోసం నా మనస్సుకు గోచరించిన అతిస్వల్ప మైన స్తోత్రాన్ని చెబుతున్నాను. హే కృష్ణే! నీకు నా నమస్కారము. నీ భక్తులైనవారికి ఆశ అనే పాశం తెగిపోతుంది. ఈ ఆశా కామా దులవల్లే మరల జన్మబంధాదులు కలుగుతాయి. కృష్ణానదీతీర్థ స్నానపానాదులచేత ఆ బంధాలు తొలగిపోతాయి. శ్రీ దత్తాత్రేయ గురుమూర్తికి ప్రియమైన నదీమతల్లివి నీవు. నీ భక్తులను ఉద్ధరించే ప్రభావాన్ని ప్రకటించుము. తల్లీ! నీకు నమస్కారము! అని ఇక్కడ నమస్కార రూపమైన యజ్ఞమనేది సూచించబడినది.

కృష్ణానదికి నమస్కరించినా ఆశ అనేది తొలగుతుంది. ఆశ మితిలేనిది. ఆశ వెంటపడేటప్పుడు నరకప్రాప్తి కలుగుతుంది. ఎప్పటికీ తప్పించుకోలేని జన్మ, కర్మబంధాన్నిచ్ఛేటటువంటి ఈ ఆశాపాశాన్ని కృష్ణానదీసేవనం చేత పోగొట్టుకోవచ్చు.

2

**అలక్ష్యం తే రూపం వచన హృదయాధ్వాతిగమతో**
**నతోఽహం తే లక్ష్యం కథమపి చ విజ్ఞాయ వరదే,**
**ప్రవృత్తస్త్వాం స్తోతుం స్వమతిగతితస్తే వరముదే**
**నమః శ్రీకృష్ణే తే జయ శమితతృష్ణే గురుమతే.**

భక్తుల సర్వాభీష్టాలను తీర్చునటువంటి హే కృష్ణే! నీ రూపం ప్రత్యక్షాదిప్రమాణాలచేత గోచరంకాదు. వాక్కులకందదు. మనస్సుకు, ఊహలకు, ఆలోచనలకు దూరమైంది. ప్రత్యక్ష, అనుమాన, ఉప మాన శాబ్దాలనే ఏ ప్రమాణమునకు నీ స్వస్వరూపం భగవద్రూపం కనుక ఏ ప్రమాణాలచేతను గుర్తించలేరు. అందువల్ల నేను వినమ్రుడనై సద్గురువుల కరుణా కటాక్షాల వల్ల అలౌకికమైన నీ దివ్యరూపాన్ని నాకు వీలైనంత తెలుసుకుని నీకు పరమప్రీతిని కలిగించుటకై లేక కృష్ణవేణికి వరుడనగా శ్రీదత్తాత్రేయ గురుమూర్తి. శివవిష్ణు స్వరూపమైన కృష్ణానదియే శ్రీదత్తాత్రేయమూర్తికి ప్రీతిపాత్ర మని ప్రసిద్ధం. అందుకనే శ్రీదత్తాత్రేయక్షేత్రాలన్నీ కృష్ణానదీతీరంలో ఉంటాయి.

భగవానుడు త్రిమూర్తిస్వరూపుడు. కనుక గుణాతీతుడైన పర మాత్మలీలలు సామాన్యులకు తెలియనలవికావు. అట్టి భగవత్క టాక్షాన్ని సంపాదించాలంటే కృష్ణానదీతీరంలో నివాసం చేయాలి. ఆ నదీతీర్థంయొక్క స్నానపానాదులచేత అంతఃకరణం శోధించబడు తుంది. తద్వారా భగవద్జ్ఞానం కలుగుతుంది.

3

**న చ ప్రాజ్యం రాజ్యం న చ విబుధపూజ్యం సురపదం**
**పదం పూష్ణో జిష్ణోరపి మమ న విష్ణో రభిమతమ్,**
**మతం దత్తాత్రేయ ప్రపద పరిపూతం తవ తటం**
**నమః శ్రీకృష్ణే తే జయ శమితతృష్ణే గురుమతే.**

కృష్ణానదిని స్తోత్రం చేస్తున్నావు కదా! నీవు ఏమి కోరుతున్నా వంటే ఏనుగులతో, గుఱ్ఱాలతో, ధనసంపదలతో సమృద్ధమైన ప్రజా పాలనరూపమైన రాజ్యమును నేను కోరను. దేవతలచేత కూడా పూజింపబడే ఇంద్ర, అగ్ని, వరుణ, వాయువుల స్థానాలను కూడా కోరను. లోకాన్ని ప్రకాశింపచేసే లోకబంధువైన సూర్యుని స్థానం కూడా కోరను. పునరావృత్తిరహితమైన సర్వవ్యాపకుడైన నారాయ ణుని స్థానమైన వైకుంఠాన్నీ కోరను. ఏమీ కోరనన్నానుకదా అని నాకు కోరిక లేకపోలేదు. తనను తాను అత్రిమహర్షికి ఇచ్చుకున్న వాడు. *"అత్రేరపత్యమభికాంక్షత ఆహ తుష్టో దత్తో మయాఽహ మితి యద్భగవాన్ స దత్తః"* అని భాగవతంలో చెప్పినట్లు తనను తానుగా ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక తాపత్రయరహితుడైన, జ్ఞాననిష్ఠుడైన అత్రిమహర్షికి ఇచ్చుకున్నవాడు. అంటే సంతానము పన్నెండు విధములుగా ఉన్నది ధర్మశాస్త్రంలో అందులో దత్తక పుత్రుడొకడు. ఆ పుత్రులలో చేరిన దత్తక పుత్రుడు కాడు ఈయన. లోకంలో దత్తపుత్రుడికి జనకుని గోత్రము, దత్తజనకుని గోత్రము రెండు సంబంధాలు ఉంటాయి. భగవంతునికి తండ్రి లేడు. కనుక ఏ గోత్రసంబంధం లేని పరబ్రహ్మ సంబంధం.

మహానదులలో కృష్ణానదికి ఒక ప్రత్యేకత ఉంది. తాను పుష్కరపర్వముగల మహానదియై కూడా తుంగ, భద్ర, భీమనది, అమరజ మొదలగు ఎన్నో ఉపనదులు ఈ మహానదిలో లీనమవుతాయి. అదియేకాక స్వయముగా పుష్కర పర్వముగల తుంగభద్రానది ఈ కృష్ణానదిలో లీనమవుతున్నది. ఈ నది ఉపనదులైన భీమ అమరజ నదుల యొక్క సంగమస్థానమే మహాతీర్థస్వరూపము.

4

**గతే జీవే కన్యాం జగతి బహుమాన్యాం శిఖరిణీ**
**హసహ్యే త్వాం ధన్యాం జనని భగినీ వామరసరిత్,**
**సమాగత్యాప్యబ్దం పరమనియమాత్ తిష్ఠతి ముదా**
**నమః శ్రీకృష్ణే తే జయ శమితతృష్ణే గురుమతే.**

తల్లీ శ్రీ కృష్ణవేణీ! బృహస్పతి కన్యారాశిని ప్రవేశించగా లోకమందు పరమ ధన్యవైన సహ్యాపర్వతమందున్న నిన్ను చూచుటకై గంగ తాను పాపాత్ముల పాపాలను పోగొట్టడంవల్ల తనకు సంచితమైన పాపమును పోగొట్టుకొనుటకై సోదరిని చూడటానికి వచ్చినట్లు అనే నెపముతో త్రికరణ శుద్ధిగా నీ దగ్గరకు వచ్చి బృహస్పతి కన్యారాశిలో ఉన్నంత వరకు పరమ నియమంతో నీ దగ్గరే ఉండిపోతుంది. ఇప్పటికీ సహ్యాపర్వతం మీద కృష్ణాపుష్కర సంవత్సరకాలము ఒక కుండమందు. గంగ ప్రవహిస్తుంది. పుష్కర సంవత్సరం దాటితే మరల కనబడదు. నేటికీ ఇది దృష్టాంతమే.

బృహస్పతి కన్యారాశియందు ప్రవేశించగా ఈ పుష్కర మహాపర్వమందు ఏ మనుష్యుడు ప్రయత్నించి కృష్ణాసేవకు వెళతాడో, అతనికి ఆయుష్యము, ఆరోగ్యము, మహదైశ్వర్యము కలుగుటేకాక ధర్మస్థితిని కూడా పొందగలుగుతాడు.

కృష్ణాపుష్కర పర్వకాలమందు (ముఖ్యంగా పుష్కర ప్రారంభంనుంచీ 12 రోజులు ముఖ్యపర్వంగా అనుకున్నా, సంవత్సరమంతా పుష్కరకాలమే) ప్రయత్న పూర్వకముగా కృష్ణ వేణీనదీ సన్నిధానమునకు చేరి ప్రాయశ్చిత్తాది కర్మలు (తీర్థవిధి మొదలైనవి) జరుపుకున్నవాడికి విశేషఫలమని ప్రమాణము చెప్పుచున్నవి. ఆ విధులే క్రింద చూపింపబడుచున్నవి.

*ముండనం చోపవాసంచ హిరణ్య శ్రాద్ధమేవ చ,*
*కరిష్యంతి నరా భక్త్యా పితౄనుద్ధారయంతి తే,*
*కన్యాగతే గురౌయస్తు తీర్థశ్రాద్ధం కరోతి వై*
*పితరో ద్వాదశాబ్దం తు తృప్తిం యాంతి న చాన్యథా*
*- కృష్ణామాహాత్మ్యం*

ఎవరు కృష్ణా పుష్కరకాలమందు భక్తితో కృష్ణాతీరమునకు చేరిముండనము (క్షురకర్మ), ఉపవాసము, హిరణ్యశ్రాద్ధము జరుపగలరో వారి పితృదేవతలను వారు ఉద్ధరించినట్లు అవుతుంది. బృహస్పతి కన్యారాశియందు ఉండగా ఎవరు తీర్థశ్రాద్ధము శ్రద్ధతో చెయ్యగలరో వారి పితృదేవతలు ఈ తీర్థవిధి ఫలముచేత 12 సం.లు (మరల కృష్ణాపుష్కరము వచ్చువరకు) సంపూర్ణమైన సంతృప్తి పొందగలరు.

బృహస్పతి కన్యాగతుడైన పుష్కరమహాపర్వంన కృష్ణాతీరానికి వెళ్లి ప్రాయశ్చిత్తాంగముగా క్షేత్రోపవాసం చెయ్యాలి. క్షురకర్మ చేయించుకోవాలి. మానవుల పాపాలన్నీ శిరస్సుమీద ఉన్న కేశముల నాశ్రయించి ఉంటాయి. ఈ ముండనముతో ఆ పాపములు తొలగిపోతాయి. అప్పుడుగాని పరిశుద్ధుడు కాలేడు. శిరోభాగమునందు పాపములు ఆశ్రయించి ఉంటాయి. ఆ తీరమందు నివసించువారికి ఈ నియమం లేదు.

బృహస్పతి సింహరాశిలో నుండగా గోదావరీ తీరమున తీర్థవిధులు జరుపుకునేవారు, బృహస్పతి కన్యారాశియందు ప్రవేశించగా కృష్ణానదీ తీరమున తీర్థవిధులు జరుపుకునేవారు ముండనము, ఉపవాసము చేయవలెను. తీరమందు నివసించే వారికి ఈ నియమం లేదు.

యాత్రకు వెళ్ళినవారు ముందు స్నానంచేసి సంకల్పం చెయ్యాలి. గణపతిపూజ, స్వస్తివాచనం, నాందీశ్రాద్ధం చెయ్యాలి. కృష్ణాసన్నిధికి చేరిన తరువాత దక్షిణలిచ్చి నదికి సాష్టాంగ నమస్కారం చెయ్యాలి. మంత్రములు లేకుండా స్నానం చెయ్యాలి. తర్వాత సకలపాపక్షయార్థం అని ప్రాయశ్చిత్తాంగంగా క్షురకర్మకు సంకల్పం చెయ్యాలి. తరువాత పరిషత్ దక్షిణ బ్రాహ్మణ ప్రదక్షిణ నమస్కారాలు చెయ్యాలి. అపసవ్యం చేసుకొని పితృదేవతల సంకల్పం చేసుకోవాలి. సవ్యం చేసుకొని పెద్దల ఆజ్ఞతీసుకొని క్షురకర్మ జరిపించుకోవాలి. తర్వాత స్నానంచేసి సంకల్పంతో ప్రాయశ్చిత్తార్ఘ్యములు చెయ్యాలి. (సువాసినీ స్త్రీలు పసుపురాసుకొని సంకల్పం చెయ్యాలి) స్నానాంగతర్పణం చేసి తెల్లని వస్త్రము ధరించివారికి అలవాటైన తిలకధారణం చేసి దేవ ఋషి పితృతర్పణం చేసి వపనాంగంగా హిరణ్య శ్రాద్ధం చెయ్యాలి. ప్రాయశ్చిత్తాంగంగా దశదానాలు చెయ్యాలి.

ఈ పదిదానములు (గోదానం, భూదానం, తిలదానం, సువర్ణం, నెయ్యి, వస్త్రము, ధాన్యము, బెల్లము, వెండి, ఉప్పు) వరుసగా చేయవలెను. దక్షిణ ఇచ్చి తరువాత బృహస్పతికి కృష్ణవేణికి ప్రతిమలు చేయించి యథాశక్తిగా పూజించాలి. ప్రతిమలు వెండితో చేయడం విశేషం. అలాగే ఇంద్రుడికి, బ్రహ్మకు ప్రతిమలు చేయించి విధియుక్తముగా పూజచేయాలి.

*అర్ఘ్య మావాహనం చైవ ద్విజాంగుష్ఠనివేశనమ్,*
*తృప్తి ప్రశ్నం చ వికిరం తీర్థశ్రాద్ధే వివర్జయేత్*

అర్ఘ్యము, ఆవాహనము, పాదాంగుష్ఠము తడిపి చల్లుకొనుట శిరస్సుపైన, తృప్తిప్రశ్న, వికిరపిండము తీర్థశ్రాద్ధమందు వదలవలెను. తన ఇంటికి చేరి కృష్ణవేణీ పూజ, దంపతీపూజ, జరుపుకోవలెను. ఇది తీర్థవిధికి చూపించిన విధానము.

# బిరబిరా కృష్ణమ్మ



చిత్రం : శ్రీమారేమండ శ్రీనివాసరావు

- డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478

**నిఖిల కల్మషహారిణులైన ప్రముఖ మహా నదులలో కృష్ణకూడా ఒకటని భక్తుల నమ్మిక. స్వర్గారోహణ సోపాన మహాపుణ్య తరంగిణిగా ప్రసిద్ధి పొందిన కృష్ణానదికి ఈ సంవత్సరం ఆగష్టు 12వ తేదీ నుండి పుష్కరాలు ప్రారంభమవుతాయి.**

కృష్ణానది అందాలరాశి - మహారాష్ట్ర లోని సహ్యాద్రిఉత్తరశిఖరమైన 'బ్రహ్మగిరి'లో అవతరించిన కృష్ణానది కొండకోనలను దాటి... వేదగిరిలో వేణీనదితో కలిసి, కృష్ణ వేణిగా సుదీర్ఘప్రయాణం చేసి.. కృష్ణాజిల్లా హంసలదీవి, ఏటిమొగల దగ్గర బంగాళా ఖాతంలో సాగరసంగమం అవుతుంది.

కృష్ణానది, ఆమె ఉపనదుల పరీవాహక ప్రాంతంలో అనేక సామ్రాజ్యాలు వెలశాయి. శాలివాహన, ఇక్ష్వాక, పల్లవ, విష్ణుకుండిన, చాళుక్య, బహమనీ, విజయనగర, మరాఠా మొదలైన రాజవంశాలవారు పాలించారు. మౌర్య, కాకతీయ, గజపతుల రాజ్యభాగాలు ఈ నదిని అధిగమించి విస్తరించాయి.

ఈ నదీపరిసరాలలో ఎన్నో పుణ్య క్షేత్రాలు, తీర్థాలు అవతరించాయి. వెడల్పు తక్కువైనా ఎక్కువకాలం నిండుగా ప్రవ హించే జీవనది కృష్ణవేణి. ఈ నది ప్రవ హించే ప్రాంతంలో ఎన్నో శతాబ్దాలనుండి చిన్నచిన్న వాగులపైనా, వంకలపైనా ఆన కట్టలు కట్టి, జలాశయాలను నిర్మించారు. కాకతీయులు, విజయనగరపాలకులు ఈ నిర్మాణాలు చేశారు. వేంగిని పాలించిన తూర్పుచాళుక్యులు ఏటికాలువలద్వారా వ్యవసాయాన్ని పెంచారు. ప్రాచీనకాలం నుండి ఈనదికి రెండువైపులా నివసించే రైతన్నలు బంగారుపంటలు పండిస్తున్నారు. ఈ ప్రాంతాన్ని ధాన్యాగారంగా మార్చారు. ఈ విషయాన్నే శంకరంబాడి సుందరాచారి మన 'రాష్ట్రగీతం'లో..

*గలగలా గోదారి కదలిపోతుంటేను*
*బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను*
*బంగారు పంటలే పండుతాయి*
*మురిపాల ముత్యాలు దొర్లుతాయి*

అన్నాడు.

సామాన్యులు, అసామాన్యులు, అతి సామాన్యులు, కృష్ణవేణీమాతను భయభక్తు లతో కొలుస్తారు. కన్నతల్లిగా ఆరాధిస్తారు. కృష్ణవేణీమతల్లికూడా తన జలహస్తాలతో బిడ్డలకు శాంతిని, దాంతిని ప్రసాదిస్తోంది.

శ్లో॥ *కృష్ణవేణీతి యో బ్రూయాత్*
*సప్తజన్మార్జితాన్యపి*
*మహాపాపాని నశ్యంతి*
*విష్ణులోకం స గచ్ఛతి ॥*

ఏ మానవుడు జీవితంలో ఒక్కసారి "కృష్ణవేణి" అని స్మరిస్తాడో వాని జన్మజన్మల పాపాలు పటాపంచలై పోవడమేగాక వాడు విష్ణుసాయుజ్యాన్ని పొందుతాడు.

గంగా యమునాసరస్వతులు ఉత్తర భారతదేశాన్ని పవిత్రం చేస్తే గోదావరీ, కృష్ణా, కావేరీ, తుంగభద్రలు దక్షిణ భారత దేశానికి జీవనాధారమై నిలుస్తున్నాయి. ప్రాచీనప్రపంచంలో నదీతీరాలు నాగరకతా నిలయాలు అని చరిత్ర చెబుతోంది. మన దేశంలోకూడా అత్యున్నతమైన ప్రాచీననాగర కత సింధునదీతీరప్రాంతంలో విస్తరించింది. ఆంధ్రదేశనదులకు కూడా అట్లాంటి చరిత్రే ఉంది. కృష్ణవేణి కిరువైపులా మహోన్నత నాగరకత వ్యాపించినట్టు చరిత్రకథనం. అందువల్ల నదులచుట్టూ ఐతిహ్యాలు, కథలు, గాథలు అల్లుకున్నాయి. నదులు, ఆతత్తీరవాసులకు ప్రత్యక్షదైవాలు, నిత్యా రాధ్యదేవతలు. కన్నతల్లులతోమాత్రమే పోల్చ దగిన మాతృమూర్తులు. నదులు కావ్య వస్తు వులు కాని భాషాసాహిత్యాలు లేవు. తెలుగు వారికి కృష్ణా, గోదావరి, పెన్నలు ప్రకృతి ప్రసాదించిన దివ్యవరాలు. ఈ నదులు

వస్తువులుగా, నేపథ్యాలుగా తెలుగులో ఎంతో సాహిత్యం వచ్చింది. కావ్యాలు, కథలు వచ్చాయి.

కృష్ణానదీప్రాశస్త్యాన్ని, పావనత్వాన్ని కృష్ణాపరీవాహక ప్రాంతంలోని పుణ్యక్షేత్రాల వైశిష్ట్యాన్ని, కృష్ణాస్వాదుజలాలతో పండిన పంటలను ప్రాచీనకవులు, ఆధునికకవులు అనే భేదం లేకుండా, ప్రాంత వివక్షలేకుండా అన్నికాలాల్లో, అన్నిప్రాంతాల్లోని కవులందరూ ముక్తకంఠంతో కీర్తించి తరించారు.

ముఖ్యంగా కృష్ణవేణి పడమటికనుమలలో సహ్యాద్రిలో జన్మించి, సముద్రంతో కలిసేవరకూ తాను పునీతం చేసిన ప్రాంతాల కథలను, గాధలను, చరిత్రను, కళలను కావ్యాలలో వర్ణించారు.

## జగత్తంతా నీటికి ప్రతిరూపమే!

భారతభూమి కర్మక్షేత్రం. భారతీయుడు కర్మయోగి. జిజ్ఞాసువులైన భారతీయులు ప్రధానంగా ప్రకృతిఆరాధకులు. సృష్టి వాళ్లకు ఆనందోత్సవకారిగా, అద్భుతవర్షిణిగా, సహకారిగా, సహచరిగా, భయావహంగాకూడా గోచరించింది. కర్మపరతంత్రుడూ, ప్రాజ్ఞుడూ ఐన భారతీయుడు విచిత్రంగా నదీనదాలు, సూర్య చంద్రులు, గ్రహాలు, తారకలు.. ఇలా సృష్టిసర్వస్వాన్నీ ఇహపర సాధకంగా భావిస్తూ–అందుకు అనుగుణంగానే తననూ, తనతోటి సమాజాన్ని మలచుకున్నాడు. అందుకే చేతనాచేతనమైన ఈ జగత్తు మొత్తం ప్రకృతిసహజపరిణామాలకు స్పందిస్తూ ఉంటే–మానవుడు ఆ ప్రకృతిస్పందనంలో, ఆ విలాసవిన్యాసంలో, ఆ విజృంభణంలో, ఒక విశిష్టమైన అనుభూతిని పొందుతూ, ఒక దివ్యప్రబోధాన్ని వింటూ, ఒక వినూత్నమైన అర్థాన్ని దర్శిస్తూ నిత్యకర్మిష్ఠి కాగలిగాడు. ఈ ప్రకృతితో ఉత్తేజితుడైన తొలివిజ్ఞాని తనకు తోచినరీతిలో ప్రకృతిని స్తుతిస్తూ కవి, ద్రష్ట కాగలిగాడు. ఈ స్తుతులలో పృథ్వీ, గ్రహాలతో పాటు– నదులు, పర్వతాలుకూడా చోటుచేసుకున్నాయి. అంటే ప్రకృతి మనకు చేసిన మహోపకారాల్ని ఉపకృతిని పురస్కరించుకుని ఆ ఋణవిముక్తికోసం కృతజ్ఞతాసూచకంగా, సంస్కారచిహ్నంగా, మనం ఆ సేవలను స్తోత్రపూర్వకంగా స్మరిస్తున్నామని భావించ వచ్చు. లేదా భారతీయమైన విశిష్టసంప్రదాయంలో తరతరాలకు ప్రకృతి రహస్యాలను అందించడానికీ, విజ్ఞానవ్యాప్తికీ ఇదొక ఉత్తమ మార్గంగా భావించవచ్చు. అందుకేనేమో ఈనాటికీ మన నిత్యనైమిత్తికవిధుల్లో, శుభాశుభకర్మ సందర్భాల్లో వంశగోత్రనామాలతో పాటు దేశ, కాల, ప్రాంతాలతో పాటు దిక్కులు, పర్వతాలు, నదులు మొదలైనవాటివివరాలుకూడా పేర్కొనాల్సివస్తుంది.

అనునిత్యం అనిరోధగతిలో భ్రమించే ఖగోళభ్రమణంలో తటస్థపడే గ్రహస్థితులుసైతం భూగోళంపైగల అఖండవాసులపై, వారిసామూహికజీవనరీతిపై, పరిసరాలపై, ప్రభావాన్ని కనబరుస్తూ ఉంటాయి. విచిత్రంగా ఈ ప్రభావం నదులపైకూడా ప్రసరిస్తూ– ఆలోచనాచక్షువైన మానవుణ్ణి పరిపరివిధాల ఆలోచింపజేస్తున్నాయి.

సర్వాంతర్యామి అయిన శ్రీమహావిష్ణువు 'నారాయణ' శబ్దవాచ్యుడు. హరిహరసమాగమసందర్భంలో **"నారా ఆపః సమాఖ్యాతా స్తాసా మయనమానితః యత స్త్వం భూతభవ్యేశ తన్నారాయణశబ్దితః"** అంటూ హరివంశం ఆనారాయణశబ్దానికి నిఘంటువును కూడా ఇచ్చింది. ఈ భాగాన్ని అనువదిస్తూ నాచనసోమన ఉత్తరహరివంశంలో "నారంబులన జలంబులం దయనంబు నీకగుట నారాయణత్వము వహించితి" అంటూ అనువదించాడు. ఈ మాటల ఆధారంగా పరిశీలించి చూస్తే సృష్టిలో నీటికి ఉన్న ప్రాధాన్యం తెలిసివస్తుంది. సర్వసృష్టికర్త అయిన శ్రీహరికే విశ్రమస్థానంగా, విడిది పట్టుగా, గమనమార్గగతిగా ఏర్పడ గలిగిన నీటిని గురించి స్వల్ప బుద్ధి ప్రసారం కలిగిన మనం ఇంతకన్నా మిన్నగా ఏం భావించ గలం? అనే



సంకోచం ఏర్పడుతూ ఉంది. అన్నగతమైన ప్రాణకోటికీ అంతెందుకూ ఈ సర్వజగత్తుకూ నీళ్లే ప్రాణాధారం. అందుకేనేమో ఈ నీళ్లకు 'జీవనం' అనే పేరుకూడా ఉంది. 'జీవం' అంటే ప్రాణం, ఆ జీవాన్ని ఇచ్చే కారణంతో నీటికి జీవనం అనే పేరు సార్థకమైనట్లు మనం భావించవచ్చు. నీరు ఈ జీవలోకపు ఉనికికీ, మనికికీ ప్రథమకారణం. నీరు కేవలం జీవిదాహోపశమనానికి మాత్రమే కాకుండా, సూర్యరశ్మివలే సకలజీవజంతువుల ఆరోగ్యానికీ, పారిశుద్ధ్యానికీ తప్పక కావాల్సినవి. నిత్యనైమిత్తికకర్మలలో జల ప్రాధాన్యం లేని క్రియావిశేషం లేదంటే అతిశయోక్తికాదు. అందుకే గృహమేధికి అగ్నితోపాటు నీరుకూడా పోరాని చుట్టమైంది. ఆచమనం మొదలుకొని, తర్పణంవరకూ, పాదప్రక్షాళనం మొదలుకొని అఘమర్షణస్నానంవరకూ, నీటికి ప్రాధాన్యం ఉంది. నీళ్లతో సంప్రోక్షణం జరగందే ఏ పదార్థమూ పరిశుద్ధిని పొందదు. అందుకే మనపూజావిధుల్లో ప్రముఖస్థానాన్ని సంతరించుకుంది – ఈ సంప్రోక్షణం. కృతజ్ఞతాబద్ధులైన మన ప్రాచీనులు తమకు ఉపకరిస్తూ, తమజీవితంలో పాలుపంచుకొంటున్న ప్రతివస్తువులో, వ్యక్తిలో దైవశక్తిని చూస్తూ ఆ వ్యక్తి, వస్తువిశేషాన్నంతటినీ దేవతలుగా భావిస్తూ నతులర్పించారు.

ఉదాహరణకు –

**తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదు చంద్రమాః**
**తదేవ శుక్రం తద్బ్రహ్మ తా ఆపః సప్రజాపతిః**

ఈ యజుర్వేదమంత్రాన్నీ, మంత్రార్థాన్నీ పురస్కరించుకుని చూస్తే ప్రాచీనఆర్యులు సర్వప్రకృతిలో బ్రహ్మపదార్థాన్ని చూడగలిగినట్లు భావించవచ్చు. ప్రాచీనులు తమసుఖమయజీవితానికి ఉనికిపట్టుగా నీటిసమృద్ధి కలిగినప్రదేశాన్ని అనుగ్రహించమంటూ కోరినట్లు కన్పిస్తుంది. ఇట్లే అథర్వవేదదీర్ఘాయుసూక్తంలో –

**సం మాసించన్తు నద్యః సంమాసించన్తు సింధవః**
**సముద్రః సమస్మాన్ సించతు ప్రజయా చ ధనేన చ**

అంటూ ప్రార్థించిన సన్నివేశాన్ని పురస్కరించుకొని చూస్తే ప్రాచీనులను అనుసరించి, ప్రజోత్పత్తికీ, ధనాదులవృద్ధికీ నీరే కారణమైనట్లు కన్పిస్తుంది. అందుకే వాళ్లు ప్రజాధనాభివృద్ధులకోసం జలపూర్ణాలైన నదీనదసముద్రాల్ని అర్థించారు.

ఈ జగత్తులో జీవనదులన్నీ జీవులైతే సముద్రుడు పరమాత్మ. ఒకే పరమాత్మ అనేకదేహాలలో ఉండి, చివరకు ఆ జీవులను తనలో లీనం చేసుకున్నట్లు సముద్రుడు తన నీటిని ఆవిరిరూపంలో మేఘాలుగా చేసి, నదులకు చేర్చి, ఆ నీటిని మరల తనలో కలుపుకుంటున్నాడు. పరమాత్మ నుండి విడివడిన జీవాత్మ ఎన్నటికైనా తిరిగి పరమాత్మను చేరవలసిందే! అలాగే సముద్రజలాలు నదులై చివరకు సముద్రుణ్ణి చేరుకొంటాయన్నమాట.

### కళలకు కాణాచి

**ప్రకాశంబారేజ దాటుకుని వెళ్లిన కృష్ణవేణమ్మ రసమయ జగత్తులోకి అడుగుపెట్టింది. తన ఒడ్డున కళకళ్లాడే పల్లెసీమలు, పల్లెల్లో ప్రతిఇంటిముంగిటా కళ్లాపి జల్లిన ప్రాంగణాలు, వాటిమీద తెల్లగా మెరిసిపోతూ తీర్చిదిద్దిన రంగవల్లులు, గట్టుమీద ఊరూరా చిన్నదో పెద్దదో ఒక దేవాలయం, అందులో నిత్య దూప దీప నైవేద్యాలతో కూడిన ఆరాధనలు, పంటచేలల్లో నాట్లువేస్తూనో కలుపుతీస్తూనో, కోతలు కోస్తూనో క్షణం తీరిక లేకుండా శ్రమించే శ్రామికులు, వారినోటినుండి జాలువారే జానపదగీతాలు, గడ్డి బీడుల్లో మేతమేసే ఆలమందలు, వాటి మెళ్ళో మువ్వలు చేసే సవ్వడులు, ఆధునికనాగరకతకు చిహ్నంగా వెలసిన హోటళ్ల నుండి, సినిమాహాళ్ల నుండీ వచ్చే మైకులజోరు, అంతలోకే ఏమూలనుండో సన్నగా శాస్త్రీయ సంగీతం, మువ్వగోపాలపదమూ, లయబద్ధమైన అడుగుల విన్యాసం, ఓ జావళీ ఇవన్నీ చూస్తూ వింటూ మరీ మంద గమనంతో అడుగుతీసి అడుగువేస్తూ, అలతీసి అలవదులుతూ కదులుతుంటుంది. కృష్ణవేణమ్మ.**

అందుకే **'ఆపః స్వభావతో మేధ్యాః' అన్నాయి–శాస్త్రాలు. అంటే – 'నీళ్లు ఆత్మలాగా స్వభావసిద్ధంగానే పవిత్రమైనవి'** అని.

పుష్కరాలలో నదులు రెట్టింపుఉత్సాహంతో ఉరకలు వేస్తాయి. నదీతీరాలకు దూరదూరంగా ఉండే ప్రజలంతా పన్నెండు సంవత్సరాలకు ఒకసారి వచ్చే ఈ పుష్కరసమయంలోనైనా నదీతీరానికి చేరుకుంటారు. పవిత్రనదీనదస్నానం బాహ్యశుద్ధినే గాక అంతఃశుద్ధిని కూడా కల్గించి సత్సంకల్పసంధానానికి, సదాశయసంవిధానానికి మూలకందమై ఆత్మసాక్షాత్కారానికి ఆయువుపట్టుగా నిలుస్తోంది. అందుకే శ్రీనాథమహాకవి

**కాలు చేయాడు కాలంబె కదలవలయు**
**తీర్థసేవకు దేహ మస్థిరము గాన"**

"కాళ్లుచేతులు సక్రమంగా పనిచేస్తున్నప్పుడే పుణ్యనదీస్నానం కోసం కదలాలిసుమా! ఈ దేహం సంగతి ఎప్పటికప్పుడు సందేహమే" అని హెచ్చరించాడు. కాబట్టి, ప్రతివ్యక్తి పుణ్యనదీస్నానం ఆచరించాలి. అందులోనూ పుష్కరకాలంలో ఆచరిస్తే అది మరింత మహత్వపూర్ణమవుతుంది.

నిరంతరం ప్రవహించే ఈ పుష్కరనదులు మనకు బోధించే దొక్కటే – **"నా ఒడ్డున నిలబడ్డ నువ్వు నాలోని నీటిని చూసి 'నది'**



అనుకుంటున్నావు. కానీ నువ్వు 'నది' అనుకున్న ఆ నీటిని చెయ్యెత్తి చూపించేలోపు ఆ నీరు బారెడు దూరంపోతుంది. అప్పటికి నీ ఎదుట క్రొత్తనీరు ప్రత్యక్షమవుతుంది. నాలో నిరంతరం జీవనం (నీరు) ప్రవహిస్తుంది కనుక నన్ను జీవనది అంటున్నావు. నిజానికి నాలో పాతజీవనం పోతుంటే, క్రొత్తజీవనం వస్తుంటుంది. నా జీవనం నిర్విరామంగా ప్రయాణించి, ఎన్ని ఆనకట్టలు వచ్చినా ఓర్పుతో, ఓపికతో వాటిని అధిగమించి చివరకు సముద్రాన్ని చేరుతుంది. అలానే నీ జీవనాన్నికూడా పరమాత్మవైపు సాగించు. ఎన్ని జన్మలెత్తినా జీవికి జీవనపరమావధి పరమాత్మే అనే సంగతి మరచిపోకు. ఈ విషయాన్ని పుష్కరానికి ఒక్కసారైనా నన్ను చూచి, గుర్తుకుతెచ్చుకో" అని. ఇలా తీర్థక్షేత్రాలకు అధికప్రాధాన్యమిచ్చే మనసంస్కృతిలో కృష్ణానదికి విశేషప్రాముఖ్యముంది.

ఇంతటి పవిత్రమైన పుష్కరఉత్సవపుణ్యసమయంలో ఆ ఉత్సవానికి సిద్ధమైన కృష్ణవేణినదీమతల్లిని అనేక విధాల స్మరిద్దాం! తరిద్దాం!!

### ఆవిర్భావం

పడమటికనుమలలోని సహ్యాపర్వతశ్రేణిలోని మహాబలేశ్వరంలో గోముఖక్షేత్రంనుండి కృష్ణానది జన్మించింది.



నీలిమేఘాలతో, గాలివిసురులతో మహాబలేశ్వరుడు గంభీరంగా నిలబడి ఉంటే, ఆయనమేనుపై నడయాడుతూ రూపుదిద్దుకున్న కృష్ణానదిని పోలవరపు కోటేశ్వరరావు అతిమనోజ్ఞంగా వర్ణించారు.

జలబిందువై/ రమ్యకరుణాంగివై
పరమేశు మెప్పించు నవనృత్తమై,
మమ్మేలు కమనీయ కల్యాణివై,
రూపొంది నావమ్మ! / మాపాలి భాగ్యమ్మ! మాతల్లి కృష్ణమ్మ!
మా వందనాలందుకొమ్మా! / మా చందనాలలది కొమ్మా!

మహాబలేశ్వరుని ఒడినుండి జారుతూ, బిందువై, ధారయై, వాగై, వంకై వడి పెంచుక గెంతుతూ, కృష్ణవేణి కదిలింది. అడుగులు వేసి పరుగులు తీసింది.

కదిలింది, కదిలింది, కాలిగజ్జెలు మ్రోయ,
కదిలిందిలే కృష్ణ, దూకిందిలే
కనులకాంతులు చిమ్మి / మేను ఝురియై దూకె
త్రాచులా బుసపెట్టె / రేచులా పరువెత్తె,
చరచరా, బిరబిరా, కదిలిందిలే

ప్రకృతి కరిగిపోతుంటే, గాలి జాలిగా మూల్గితుంటే, తియతీపులతో నిండిపోతుంటే, భిషగ్వరుల ప్రశంసలనందుకుని సాగింది – కృష్ణ. పవిత్రనదులు గాయత్రి, సావిత్రి, కుముద్వతి కలిశాయి.

శ్రీకృష్ణునిఅంశగా రూపొందిన కృష్ణ, పరమేశ్వరుని అంశ అయిన వేణీనదిని, సతారాకు ఆరుకిలోమీటర్ల దూరంలో మహాతీ వద్ద కలుపుకుంది. కృష్ణవేణిగా పేరుపొంది, శివకేశవుల అభేద రూపంగా పూజించబడుతోంది. భక్తులు మనసారా కృష్ణవేణిని కొలుస్తారు.

### కృష్ణవేణీనదీప్రశస్తి

శ్లో॥ కృష్ణాతరంగ సంభూత పవనస్పర్శమాత్రతః
నిర్ధూతపాతకా స్సర్వే జనా విష్ణుపదం యయుః

కృష్ణానదీతరంగాలపైని గాలిసోకినా చాలు పాపాలన్నీ నశించి జనులు విష్ణులోకాన్ని పొందుతారు.

శ్లో॥ సకృత్ యత్పాదసంస్పర్శాత్
గంగాऽభూత్ స్వర్మోక్షదా
తస్య విష్ణోస్తను స్సాక్షాత్
కృష్ణేయం కథ మీడ్యతే

శ్రీమహావిష్ణువు పాదాలనుండి పుట్టినగంగ మోక్షాన్ని ప్రసాదించగలుగుతూ ఉంటే - సాక్షాత్ విష్ణుదేహోద్భవయైన కృష్ణ మాహాత్మ్యాన్ని ఇంత అని కొనియాడడం సాధ్యమా? కృష్ణవేణిలో గ్రుక్కెడునీళ్లు గ్రోలినా చాలు జన్మ తరిస్తుంది.

## పురాణాలు - కృష్ణవేణి

వేదసంహితలే కాకుండా పురాణాలుకూడా ఈ నదీమతల్లిని ప్రస్తావించాయి. ప్రశంసించాయి.

సహ్యపర్వతోద్భవాలైన వరదుల పట్టికలో విష్ణుపురాణం కృష్ణా నదిని చేరుస్తూ- ఇదికూడా గోదావరివలే పాపభయాపహారిణి అంటూ తెలియజేసింది.

మార్కండేయపురాణం గోదావరీ, భీమరథీ, కృష్ణవేణీనదులను **'సరిదుత్తమాః'** అంటూ చెప్పి, కృష్ణానదిని ఉత్తమనదుల పట్టికలో చేర్చింది. ఇట్లే వాయుపురాణం భువనవిన్యాసప్రకరణంలో సహ్య సానునిస్సృతాలైన దక్షిణాపథపుణ్యనదుల్లో కృష్ణానదికి మూడో స్థానాన్ని కల్పించింది. కూర్మపురాణం కేతుమాలాది వర్షవర్ణనం చేస్తూ దక్షిణానదీవర్ణనావసరంలో పాపహరాలైన నదుల పట్టికలో కృష్ణానదిని చేర్చింది.

మత్స్యపురాణం శ్రాద్ధప్రకరణంలో శ్రాద్ధయోగ్యతీర్థాలను పేర్కొంటూ చెప్పిన సందర్భంలో గోదావరి మొదలైనవాటి తర్వాత కృష్ణానదినికూడా కలిపి, ఆ నదికి యోగ్యతను చేకూర్చింది.

ఇట్లే వామనపురాణంకూడా భువనకోశవర్ణనావసరంలో కృష్ణా, గోదావరి మొదలైననదులను సహ్యపర్వతనిస్సృతాలైన మహానదులుగా పేర్కొంటూ **"జగతో మాతరః సర్వాః సాగరయోషితః"** అంటూ చెప్పి, జగత్తుకు తల్లులవంటివైన ఈ నదులన్నీ సాగర పత్నులంటూ సపత్నీత్వాన్ని ఈ నదులకు చేర్చింది.

శ్రీమద్భాగవతంలో పంచమస్కంధంలో భూగోళ, ఖగోళ వర్ణనలో మరియు దశమస్కంధంలో బలరామయాత్రావర్ణన ప్రసక్తిలో కృష్ణానది ప్రముఖస్థానాన్ని వహించింది.

## ఇతిహాసాలు - కృష్ణవేణి

భారతాదిఇతిహాసాలూ, రామాయణాదికావ్యాలన్నీ పుణ్యనదులనూ, ఆ నదుల ఉత్పత్తిస్థానాలనూ పేర్కొన్నాయి. మహాభారతం సభాపర్వంలో వరుణదేవునిసభను వర్ణిస్తూ- ఆ సభ అంతస్సలిలాలు రత్నమయాలైన ఫలవృక్షాదులతో కూడి, ఎంతో సుఖవంతంగా ఉండడమే కాకుండా అందులో శ్రేష్ఠులూ, దేవతలూ, పర్వతాలూ, పుణ్యనదులూ నివాసం చేస్తుంటాయి, అని చెప్పిన సందర్భంలో ఆ పుణ్యనదుల్ని పేర్కొంటూ -

**గోదావరీకృష్ణవేణ్యౌ కావేరీ చ సరిద్వరా**
**కిం పునా చ విశల్యా చ తథా వైతరణీనదీ (9-26)**

అని చెప్పి ఆ పుణ్యనదుల పట్టికలో కృష్ణవేణీ నదిని చేర్చింది.

మహాభారతవనపర్వంలో యుధిష్ఠిరుడు వేరువేరు తీర్థాలను సేవిస్తూ, ఆయా తీర్థప్రభావాలను చెప్పే సందర్భంలోనూ, మరో చోట అంటే సహనానుక, అగ్నిజలప్రవేశం చేసి తిరిగి అంగిరుని ప్రయత్నంతో ప్రాకటాన్ని పొందిన సందర్భంలోనూ గోదావరి మొదలైన నదులతోపాటు కృష్ణానదికూడా అగ్నికి మాతృస్థానమైనట్లు పేర్కొనింది. భీష్మపర్వంకూడా ఈ కృష్ణవేణి ఉపనదియైన దేవకుండంలో స్నానం చేసిన వారికి, వారి వారి పూర్వజన్మల స్పృహ వస్తుందని తెలుపబడింది. ఇదే పర్వం కృష్ణవేణిని మిగతా అన్నినదులలోను ముఖ్యమైందిగా తెలియజేసింది.

## తెలుగుసాహిత్యం- కృష్ణవేణి

వీరశైవమతస్థాపనకు నడుంకట్టి, అస్పృశ్యతను వద్దన్న స్త్రీ పురుషసమానత్వాన్ని చాటి చెప్పిన పరమమహేశ్వరుడు బసవేశ్వ


చిత్రం : శ్రీమారేమండ శ్రీనివాసరావు

రుడు మనసారా కీర్తించిననేల ఇది. పాల్కురికి సోమన పలుకు లల్లిననేల కృష్ణ. వీరి పండితారాధ్య చరిత్రలో శ్రీ శైలంలో ప్రవహి స్తున్న కృష్ణానదిని పాతాళగంగగానూ, కృష్ణవేణిగాను రెండుపేర్లతో వ్యవహరించాడు. నందికేశ్వరునిసుతుడైన పర్వతుడు శివుని 'గంగ భాగీరథి గంగ పాతాళగంగ భీమరథి సౌగంధిక... వేదవతియు, శుక్ర ప్రభాసవేణి పుష్కరకృష్ణవేణి మొదలన్నింటిని తన తలమీద ఉండేటట్లు' ప్రార్థించాడు.

ఈ కవియే సంగమేశ్వరక్షేత్రాన్ని వర్ణిస్తూ "... జగత్ ఖ్యాతిత లీల నరినొప్పుగూడలి సంగమేశ్వరము దనరారు తుంగభద్రయు కృష్ణవేణియునుగూడ గూడలి యననొప్పు జూడ..." (పర్వత.540) అని తుంగభద్రా, కృష్ణవేణీనదుల సంగమంచే ఈ క్షేత్రం కూడలి సంగమేశ్వరంగా సార్థకమైనట్టు తెల్పాడు.

తిక్కన తన ఆంధ్రమహాభారతంలో భీష్మపర్వంలో సంజయుడు ధృతరాష్ట్రునికి భూపరిమాణాన్ని వివరించే సందర్భంలో కృష్ణవేణి, తుంగభద్ర, పెన్న, గోదావరి, బాహుదా మొదలగు నదుల్ని పేర్కొన్నాడు. ఎఱ్ఱాప్రెగడ తన నృసింహపురాణంలో అహోబిలం, సింహాచలం, వేంకటాచలం, పుష్పగిరి, సిద్ధాచలం మొదలైన పుణ్యక్షేత్రాలతోపాటు గోదావరి, కృష్ణవేణితీర్థాలనుకూడా వర్ణించాడు. భాస్కర రామాయణంలో ఆంజనేయాది వానరశ్రేష్ఠులు సీతమ్మకోసం కృష్ణవేణీతీరప్రదేశాలనుకూడా గాలించారు.



శ్రీనాథకవిసార్వభౌముడు పల్నాటివీరచరిత్రలో చంద్రభాగ, నాగలేరులాంటి నదులను పేర్కొంటూ పలనాటిసీమలో ఉన్న చంద్రభాగ 'కృష్ణకు సమం' అని ప్రస్తుతించాడు.

రాచమర్యాదలతో వైభవంగా వెలిగిన శ్రీనాథునిజీవితంలో అవసానదశ మాత్రం దయనీయంగా ముగిసిందనే విషయం అందరికీ తెలిసిందే. శ్రీనాథునివిషాదజీవితానికి కృష్ణానది హేతువు కావడం దురదృష్టకరం.

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయె దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు




## కూచిపూడి సంప్రదాయ నృత్యం

కృష్ణాతీరంలోని కూచిపూడి గ్రామం తెలుగువారి ప్రత్యేక నృత్య శైలిగా ఈనాడు గుర్తింబడుతున్న సంప్రదాయ కూచిపూడి నృత్యానికి జన్మస్థలం. అభినయం, ఆంగికం, వాచ్యం ముప్పేటల గొలుసులాగా అల్లుకున్న ఒక విశిష్టమైన నృత్యరీతే కూచిపూడి నృత్యం. సిద్ధేంద్రయోగి మార్గదర్శకత్వంలో ఈ నృత్యం మొగ్గతొడిగి పుష్పించి పరిమళాలను వెదజల్లుతోంది. సిద్ధేంద్రుని సత్యభామ సగర్వంగా నిలబడి, వయ్యారాలు పోతూ, వాల్జడను ప్రదర్శిస్తూ జగద్విఖ్యాతి పొందింది.

భామనే! సత్యాభామనే!
భామనే పదియారు వేలా
కోమలూ లందరీలోనా
రామరో! గోపాల దేవుని
ప్రేమదాననై సత్యాభామనే

సిద్ధేంద్రుని సత్యభామతో సరసాలాడి, మురిపించు శృంగారి మువ్వపురి క్షేత్రయ్య పదకవితలోని మధురభావమే కృష్ణవేణి!

### ఆకర్షించే కొండపల్లి బొమ్మలు



**కృష్ణాజలాలతో సారవంతమైన, సుభిక్షమైన ఈ ప్రాంతంలో ప్రజలజీవితాలు సుఖసంతోషాలకు నిలయమై, కళలు వికసించి పరివ్యాప్తమై, కమనీయమైన కళాప్రపంచం రసహృదయుల జీవితాన్ని రాగరంజితం చేస్తోంది. రంగురంగుల కొండపల్లిబొమ్మలు, దేశ విదేశాల్లో బాగాప్రాచుర్యం పొందాయి. విజయవాడ సమీపంలోని కొండపల్లిగ్రామంలో గ్రామీణ కళాకారులకుటుంబాలు కొన్ని ఈ కళలను అంటిపెట్టుకుని జీవిస్తున్నాయి. నిజానికి ఈ కుటుంబాల వారు వెనకెప్పుడో రాజస్థాన్‌నుండి వలస వచ్చి ఇక్కడ స్థిరపడిపోయి, తెలుగువారి కళాప్రపంచంలో ఒక అంతర్భాగంలో అయిపోయారు. కొండపల్లి అడవుల్లో లభించే ఒకరకమైన తేలిక పాటి పుణికికర్రతో తయారు చేసే ఈ బొమ్మల్లో తెలుగు జానపద జీవితం ముమ్మూర్తులా దర్శనమిస్తుంది. కొండపల్లి బొమ్మల్లో రాజుగారి ఏనుగు అంబారీ, రాజుగారి ఏనుగు అంబారీ, దశావ తారాలు ఎక్కువ ప్రసిద్ధిపొందాయి.**

అని కృష్ణానదీతీరంలో బొడ్డుపల్లిలో వ్యవసాయానికి దిగి, పన్నులు సకాలంలో చెల్లించలేక నిస్సహాయకస్థితిలో దివిజకవి వరుగుండియల్ దిగ్గురనగ శ్రీనాథుడు స్వర్గానికి వెళ్లిపోయాడు.

బమ్మెఱ పోతనామాత్యుడు తనఆంధ్రభాగవతంలో **"తుంగభద్రయు, కృష్ణవేణియు, చంద్రభాగయు, భీమరథియు, గోదావరియు.. మహానదులును భారతవర్షమున కలవు. అందు సుస్నాతులై మానవులు ముక్తి చెందుదురు"** అని వర్ణించాడు.

శ్రీనాథునిసమకాలికుడైన గౌరన తన **'నవనాథచరిత్ర'**లో కృష్ణవేణీనదీగమనపు సోయగాన్ని తనివితీరా వర్ణించాడు. **'లోకుల పాతకంబులఁ దన్ను దలచిన మాత్రానఁ దొలగింపజాలి వెలసినదే కృష్ణవేణి'** అని ఉగ్గడిస్తూ గౌరన **'కృష్ణాజలాలు, అక్కడి వృక్షాలు మునిముఖ్యుల కెల్లకాలంబు వసియింపగ నిరవైన'**వని హృద్యంగా వర్ణించాడు.

భోజరాజీయం రచించిన అనంతామాత్యుడు **'విలసితంబగు కృష్ణవేణీ మలాపహారిణి భీమరథి నా ధరిత్రియందు దనరు నదీ త్రయాంతర్వేది యగు పావన క్షేత్రము'** అని తన నివాసస్థానమైన పెరుమగూరు కృష్ణవేణి, మలాపహారిణి, భీమరథి నదులు కలిసిన ప్రదేశం 'అంతర్వేది' కి సమీపంలో ఉందని పేర్కొన్నాడు. వెన్నెల కంటిసూరన, కొరవిగోపరాజు, మడికిసింగన కృష్ణ, గోదావరి భీమరథి, నర్మద, తుంగభద్ర, కావేరినదులలో మునిగితే **'నాకలోక సౌఖ్యంబు'** గలుగుతుం దని వర్ణించారు.

**'కృష్ణాగౌతమి మధ్యభూమ్యస్తోత్కలరాట్పురీహరణలీలావార్య శౌర్యోదయు'** దని అల్లసానిపెద్దన శ్రీకృష్ణదేవరాయలను అభివర్ణించాడు. కృష్ణా గౌతమీ నదుల నడుమ ఉన్న వేంగీదేశంపై దాడిచేసి జమ్మిలోయ, కోనసీమ మొదలైన మన్యసీమలను జయించిన వీరుడు కృష్ణరాయలని దీనిభావం. ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యంలో నత్కీరుడు, తీర్థయాత్రాపరులకు సురతరువు కొమ్మయైన గుండ్లకమ్మనదిలో, సుకృతిభూతపాతక శ్రేణియగు కృష్ణవేణిలో మునిగి పవిత్రీభూతచేతస్కుడయ్యాడు. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యంలోనే అగస్త్యుడు **'గౌతమీకృష్ణవేణ్యవగాహనములసేసి, శ్రీశైలనాథు దర్శించి'** నాడని చెప్పబడింది.

తెనాలి రామకృష్ణుని 'పాండురంగమాహాత్మ్యం' లో కలశసూతుడైన అగస్త్యునికి కుమారస్వామి గంగ, పెన్న, విపాశ, చంద్రభాగ, శరావతి, వేత్రవతి, బాహుద, కృష్ణవేణి, కావేరి, కపిశ, మంజీర, భవనాశిని (సరయూనది), తుంగభద్ర, గౌతమి మొదలగు నదీ తీర్థాల దివ్యచరిత్రలను వినిపించాడు.

క॥ ఈ గంగాదిక తీర్థము
లీగంగా నీవు తమ సమిద్ధాంబువులన్
దోఁగెడు వారల గనగనఁ
గ్రాఁగెడు నంగార సింధుకల్లోములన్ (1-150)

"పైన చెప్పబడ్డ గంగ మొదలైన తీర్థాలు, మిక్కిలి పవిత్రాలైన తమ జలాల్లో మునిగేవారిని గనగన మండుతుండే నిప్పుటేటి అలల్లో మునుగనీయవు, అంటే పవిత్రమైన గంగాదితీర్థాలలో మునిగేవారికి నరకలోకంలోని వైతరిణినదిలో గనగన మండే నిప్పు అలలలో మునగాల్సిన అవసరం లేదు. వారు నరకానికి వెళ్లరు. పుణ్యలోకాలు పొందుతారు."

చేమకూరవేంకటకవి 'విజయవిలాసం'లో తీర్థయాత్రలకు బయలుదేరిన అర్జునుడు కృష్ణవేణ్యాదిపుణ్యతరంగిణులలో మునిగి సుభద్రకౌగిలిలో తేలాడు.

ఇంకా పింగళిసూరన, రామరాజభూషణుడు అద్దంకి గంగాధరకవి, చరిగొండధర్మన, భైరవకవి, మల్లన, కుమారధూర్జటి,

దోనేరు కోనేరునాథుడు, బిజ్జుల తిమ్మభూపాలుడు పాల వేకరి కదిరీపతి అందుగుల వెంకయ్య, దామెర్ల వెంగళనాయకుడు, వెలగపూడి కృష్ణయామాత్యుడు, అయ్యలరాజు నారాయణామా త్యుడు మొదలైన కవులెందరో తమ సాహిత్యంలో కృష్ణానదిని ప్రస్తావించినవారే.

వేటూరిప్రభాకరశాస్త్రి కృష్ణాతీరంలోనున్న విజయవాడను వర్ణిం చినతీరు రమణీయం.

ఈ యింద్రకీలాద్రి నింద్రజు డభవుతో
పోరి పాశుపతంబు పాసగ నందె
నీ పుణ్యగరిమయందు నీశుండు భూమీ
సురున కర్ధిసాయుజ్య మొనయనిచ్చె
నీ పట్టణంబున నెలమి మాధవవర్మ
ఘనముగా గురియించె కనకవర్ష
మీ క్షేత్రమున శమీవృక్షంబునను వహ్ని
బటుచేల చేగట్టె పండితయ్య

భవ్య కృష్ణానదీ తటప్రాప్త భోగ
దక్ష సన్మోక్ష లక్ష్మీ ప్రధానమనగ
చెలగె మల్లేశ లింగనస్థితి నిరూఢి
పుణ్యనిలయంబు బెజవాడ పురంబు.



బంగారుతల్లి కనకదుర్గ. విజయవాడ, అనగానే కనకదుర్గ – కనకదుర్గ అనగానే విజయవాడ గుర్తుకు వస్తుంది. అమ్మ దుర్గ వరాల తల్లి. దుర్గమ్మ శాంత – సుందరమూర్తి. ఆ తల్లి వదనం వాత్సల్య ప్రకాశం. అలంకారంలో అమ్మను దర్శించడానికి మానవ నేత్రాలు చాలవు. కనకదుర్గ విజయవాడకు అధిష్ఠాత్రీదేవి. కృష్ణా నదీ తీరాన ఈ దేవి స్వయంవ్యక్త అయి వేంచేసి ఉన్నారు. ఆమె కాలతీత. యుగాలపూర్వం వెలసినదేవి, మాత, తల్లి, అమ్మ. కష్టాలు తొలగించి సుఖాలు కలిగించే వరాల కనకదుర్గను, దర్శించటానికి నిత్యం వేలవేల యాత్రికులు చేరుతుంటారు.

కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ అస్వతంత్ర జాతి హైన్యాన్ని, దైన్యాన్ని రూపుమాపాలంటే తెలుగునదులన్నీ పొంగి ముంచివేయాలని ఆవేశంగా అంటారు. గౌతమీ కృష్ణాతరంగాలు తారకలు తిరుగాడే మార్గంలో అంటే ఆకాశం దాకా ఎగసి ముంచివేయాలి. లేకపోతే ఈ బ్రతుకు తెన్గువారు భరించలేరని ఉద్వేగమహితంగా అంటారు.

గోదావరీ పావనోదార వాఃపూర
మఖిల భారతము మాదన్న నాడు
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
కవులగానము శ్రుతిఁగలయునాడు
కృష్ణాతరంగ నిర్ణిద్ర గానము తోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు

అక్షరజ్ఞానమెరుగదో ఆంధ్రజాతి
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపుపాట పిచ్చుకగూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు

–అన్న విశ్వనాథ పద్యం అతి ప్రసిద్ధం. విశ్వనాథ కృష్ణవేణి మీదుగా వచ్చే గాలులకు ప్రకృతి అంతా తన్మయానికి లోనయిం దంటారు. కృష్ణవేణీ తరంగ నిర్ణిద్రమధురలీలా స్వనమ్ముతో గలసిమెలసి వచ్చు మలయ మంజుల సాంధ్యవాతములకు ప్రకృతి యంతయు తన్మయత్వమ్ము నొందెనని విశ్వనాథ పరవశంతో పలుకుతారు.

## పుష్కర సంరంభాలు

తిమిరంతో సమరం జరిపిన మహాకవి దాశరథి– 'ఒకవైపు కృష్ణవేణిక ఉబ్బి తబ్బిబ్బు / లైసాగి తెల్గింట సేసపెట్ట' సుజలయై తెలుగుతల్లి శోభిస్తున్నదనీ. 'నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీరొత్తుకొనుచు నాపై ప్రేమమినుమడింప జేసిందనీ, 'కృష్ణానదీ తరంగాలు తృష్ణ దీర్పు సుదారుఘురులనీ దాశరథి తృప్తిచెందారు.

క్షితి నెన్నెన్ని యుగాలనుండి భవదక్షిణ ప్రవాహము భా
రత దేశస్థ మహాంధ్రమున్ తడిపెనో! రత్నాలు పండించెనో!
పతియౌ అంబుధి నిన్ను వీచికలతో బంధించి ప్రేమించెనో!
నతులందింతును పుష్కరవ్రతవిధిన్ నాతల్లి! కృష్ణాపగా!

పుష్కరము వేళ నీనీట మునుగు మాకు
పూత మందాకినీ గాహ పుణ్యమబ్బు
ఈ మహాపర్వమందు తల్లీ! త్వదీయ
వారిధారల గ్రుంకుట వలన ముక్తి

మాకు జ్ఞానదానము జేసి మనుపుమమ్మ" - అని దాశరథి పాపాలను పోగొట్టి, పుణ్యాలనిచ్చి ఎదలోని మంటలార్పే చల్లని తల్లిగా కృష్ణానదిని అభివర్ణించారు.

కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి - కృష్ణవేణి పుష్కరాలకు ఇలా ఆహ్వానం పలికారు.

కదలిరావే కృష్ణవేణి!
కదలిరా నిత్యకల్యాణి!
కదలికదలిరా కడుపుచల్లనితల్లి!
జలజలా పొంగుతూ కిలకిలానవ్వుతూ



కోటితీర్థాలు నీ నోటిలో దాచి ము
క్కోటిదేవతలు నీ పైటలో ముడివైచి
కదలిరా కదలిరా కదలిరాయని రాణి!
ఎదురుచూచుచున్న ఓ తెల్గుమాగాణి

అని పుష్కరాలవేళ కృష్ణానదిలో మునిగే జనులను పునీతులను చేయగ - **గళమెత్తి పాడుతూ నలుదెసల చాటుతూ, కలహంస గమనవై కలికలుష శమనవై** - రమ్మంటూ కరుణశ్రీ స్వాగతం పలికారు.

తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తిగారు **'ఈ పుష్కర సుది నమ్ముల నీపావనతీర్థముల మునింగి తను హృద్దీపక శుచితా సంపద నాపోవలంచువారి'** నభినందింతునన్నారు.

తల్లి! కృష్ణానదీ! భవత్తటమునందె
మ్రోసె నాంధ్రపతాక మమ్మొదటి దెగసి
తెలుగునావలు నీ దీవనలు గడించి
యెత్తె తెరచాప దీవుల నెల్ల నొత్తె
..... ..... .................
నీవు కరుణానిధివి

అని కృష్ణానది పావనత్వానికి జోహారులర్పించారు.

రైతులు కృష్ణమ్మను చూసి మురిసిపోతారు. పూసిన తంగేదులా ఉన్న ఆమె రూపు వారికి ఆరాధ్యదైవం. ప్రత్యక్షరూపం.

అమ్మతల్లి కిట్టమ్మకు హారతిచ్చి మొక్కరా!
రైతు కూలి బిడ్డలకు ఆమె పేరు ముందురా!
ఝున్నన ననన ఝున్నన - ఝున్నన ననన ఝున్నన.....

అల్లంత దూరంతో పైరుగాలికి కదిలే సముద్ర కెరటాలు వాటి కమ్మని సంగీతాలు విన్పిస్తుంటాయి. పల్లెకారుల శ్రమగీతాల బాణీలు శ్రుతిపక్వంగా లయ కలుపుతుంటాయి. ప్రకృతి మనోహరంగా ఉంటుంది. తెరచాపల రెపరెపలు, పక్షుల కిలకిలా రావాలు, జలచరాల త్రుళ్లింతలు మనోజ్ఞంగా ఉంటాయి. కృష్ణవేణి గంగపుత్రుల పాటలకు మురిసిపోతుంటుంది.

అమ్మో! కిట్టమ్మో! మాయమ్మో! కిట్టమ్మో!
అక్కడెక్కడో పుట్టావు, ఇక్కడికే వచ్చావు,
పిల్లపాపల నందరి చల్లంగా ఏలేవు.

నిన్ను నమ్మి జీవించే మమ్ముల కాయవె తల్లీ!
చల్లగ నీ వడిలోబడి సాగిపోవు మా జీవిక.

వరదొస్తే నీ రూపం వొడ్డొరసే నీ కోపం
చూడలేము మాతల్లో! ఇద్దరి అర్థం ఏకం.

జీవధార నీవమ్మా! జీవనాధార వమ్మ
పూలూ బుక్కాయిపెట్టి పూజింతుము మాతల్లో!





# గోకులాష్టమి

**కే.శే.ఆదూరి సత్యవతీదేవి**

'నల్లనివాడు పద్మనయనంబులవాడు...' అన్నాడు పోతన. నల్లనివాడని చెప్పి అమ్మా, నాన్నా - కృష్ణుడని పేరు పెట్టారు. అయినా, అతడికెంత కులుకూ! నల్లని వాడైనా నవమోహనాకారుడని పేరు తెచ్చుకున్నాడు.

చూచినవాళ్లంతా ఒకటే మురిసిపోవడం - అతడి నల్లని అందం చూచి! కళ్లు తిప్పకోలేని తమకం - వారికి ఆ నల్లనికృష్ణుణ్ణి చూస్తే!

అసలు వాళ్ల అమ్మకే తనివితీరదు - ఆ చిన్నిశిశువు ఒంటి తళుకూ బెళుకూ ఎంత చూచినా! మాటిమాటికీ దృష్టి దోషం తగులుతుందేమోనని దిష్టి తీయడం, రక్ష పెట్టడం....

ద్వాపరయుగం నాటి నుంచీ ఇదేవరుస! అప్పటికీ ఇప్పటికీ ఆ సమ్మోహకరూపం అట్లానే అలరిస్తున్నది అందరినీ!

సంగీత, సాహిత్యాది సమస్తకళలకూ ఆయువు పట్టుగా ఆ జగన్మోహక రూపం, ఎందరెన్ని విధాల ఆడీ, పాడీ, కవిత్వం చెప్పీ, శిల్పాలు చెక్కి ఆరాధించీ, ఆరాధించీ - అందుకోవాలని చూచారో ఆ నల్లని కృష్ణుణ్ణి!

అదుగో ఆ వరుసలోనే ఈ నాటి 'గోకులాష్టమి' సంగీత రూపకం- ఆగష్టు 25న శ్రీకృష్ణాష్టమి సందర్భంగా మీ కోసం... ఆస్వాదించండి... ఆనందించండి... ఆనందానికి మారుపేరైన ఆనందగోకులంలోకి మీరూ నడవండి.....

సౌందర్యాలన్నీ ఒక చోట చేరినట్లు, కమ్మని నాదా లన్నీ ఒకే ప్రోగై మ్రోగినట్లు, సంగీత స్వరగంగ పొంగినట్లు సురలోక సామ్రాజ్య మందినట్లు... ఆ పల్లెలో.... కల్లలెఱుగని ఆ గొల్లల మనస్సుల్లో ఎల్లలెరుగని ఆనందం... మును పెన్నడూ పొందని అనుభవం అలలాగ అలముకుంది. ఆనందావిష్కరణ జరుగుతోంది!

అది యుగాలనాటి ప్రాభవం. ఋషి వాక్కుల కథా కథన వివరం... భగవంతుని జననం.

### వ్రేపల్లెలో తెలతెలవారుతుండగా

**ముదుసలి గోపెమ్మ:** ఇలా తెల్లవారిందో లేదో.. ఏమిటా పరుగులు పిల్లల్లారా? లేగదూడలు కాళ్లకు అడ్డంపడుతున్నా విదిలించుకొని, చిలికే మజ్జిగ కవ్వాలు గిరవాటేసి మరీ వెడుతున్నారు. మందలోని జనమంతా అట్లా తొందరతొందరలై ఆనందుని ఇంటివైపుగా పోతున్నారు! ఎమిటా విశేషం? అవునూ... యశోదమ్మ... ఆఁ ఆ. అదా సంగతీ, నీళ్లాడెన్ కదా నిండుకొమ్మ.

### ఇంతలో గోపికలు

**చూచివద్దము రారె సుదతులార!**
**మన యశోద చిన్ని మగవాని కనెనట**
**అందాల పోగట అపురూప జననమట**
**నందగోకులమున నిక విందులే చిందునట ॥**

**అన్నారు ఎవ్వరో ఆకాశవాసులు**
**చిన్నారి బాలుడే శ్రీమహావిష్ణువని ॥**

**విన్నానులే నేను విన్నానులే**
**కలగంటినేమో అనుకున్నానులే**
**లాలలే పోయాలి జోలలే పాడాలి**
**నలుగులేపెట్టాలి తిలకమును దిద్దాలి ॥**

**ఒకరు:** చూడు చూడవే – యశోదమ్మ పక్కలోని ఆ చిన్ని శిశువు మేఘాలపొత్తిళ్లలోని చందమామలా ఎలా వెలిగిపోతున్నాడో!

**మరొకరు:** కాదు, కాదు చందమామ ప్రక్కనున్న మబ్బు ముక్కలాగ. పూర్ణకుంభమైన ఆ యశోదమ్మను కరచుకొని అబ్బో! ఎంత నీలి నీలి నునుపుల లేతలావణ్యంతో ఓలలాడుతున్నాడో!

**వేరొకరు:** చూడవే. ముద్దులొలికే ఆ పెదవులూ, అరమోడ్పు నిద్దురకన్నులూ... మెలితిరిగిన ఆ నల్లనికురులూ... ఒకసారి చేతిలోకి తీసుకొని స్నానాలు చేయించి... గంధాలు పూసి..

**గోపిక:** చాలు చాలు. దిష్టి తగిలేను. ఆగవమ్మా కాస్త. రండర్రా రండి! ఇవిగో పన్నీటిజలాలు. ఇవిగో సుగంధ తైలాలు. ఇవిగో సాంబ్రాణి చూర్ణాలు.

**గోపికలందరూ**

**పుట్టక పుట్టక పుట్టిన తండ్రికి**
**పునుగు జవ్వాదిస్నానం**
**పున్నమివెన్నెల కన్నుల కందుకు**
**పూలగంధాల స్నానం ॥**

**యశోద నోముల ఘనఫలరాశికి**
**యమునజలాల స్నానం**
**నీలినీలి పసి గోపబాలునికి**
**పాల పన్నీటిస్నానం ॥**

**చిరుచిరునవ్వుల చల్లని దొరకి**
**చందన పరిమళ స్నానం**
**అలరే సొగసుల తొగరు మేనికి**
**కలువల కస్తూరి స్నానం ॥**

**ఊగే కురుల జాబిలిమొగ్గకు**
**జాజుల దవనపు స్నానం ॥**

ఆ పురిటికందును చూడటానికై వచ్చే జనం, పోయేజనంగా యశోదమ్మ ఇల్లు తిరణాలైపోయింది. ప్రకృతంతా పరిమళభరితమై పోయింది. వర్షిస్తున్నవి శ్రావణ మేఘాలే అయినా అక్కడివారి మానసాలన్నీ క్షీరసాగరాలై పొంగులు వారుతున్నాయి. ఆ పల్లెగొల్లల ఆనందమే తేజస్సుగా ఆ చిన్నిబాలునితో అనుబంధమే పరతత్త్వంగా నిండి కాలం లీలావినోదంగా సాగుతోంది!

\- - - - - - -

విత్తు మొక్కయి నిలిచింది. మొగ్గ పూవై విరిసింది. పూవు కాయై పంట పండింది. వాగు వరదై పొంగింది. వాన మేఘం ధరణిపై కరిగిజారింది.

చిన్నికృష్ణుని జన్మాష్టమి రానే వచ్చింది ఇక ఇల్లూ ఇల్లూ సందడే! ఊరు పూరంతా పండగే!

**చిన్నినవ్వుల పాల శిశువుకు ఎన్ని వేడుకలో**
**చూడరే జన్మాష్టమిని కనుల పండుగలో ॥**

**నందతనయుని చూడగోరి వచ్చి చేరిరి ఎందరో**
**విచ్చిన తామరల కొలనుల ముచ్చటాయెను ముంగిలి ॥**

**మొగ్గ జాబిలి దొరికె ననుచు బుగ్గలను నిమిరి**
**ప్రేమ పొత్తిలి పరచి మురిసి కాలమే మరచి ॥**

**సిగను పింఛము బాగ కూర్చిరి గొల్లకన్నియలు**
**గగనమును తన సిగను మోసే దేవదేవునికి ॥**

**తొగరు చుక్కగ జీవితాశలు మోవి పైనుంచి**
**అగరు కర్పూర హారతులుగా అహము నర్పించి ॥**

**చక్కనైన ఒక్క కొడుకని చొక్క పలికిరి యశోదతో**
**ఒక్కడంటే తెల్లబోయెను ముక్కోటి వేల్పుల మూలమును గని ॥**

**పాలసంద్రము కడవ కడవగ ఆలమందను జేరెను**
**తడవ తడవకు జనుల గుండెలో ప్రణవమే మార్మోగెనూ॥**

**గోపిక:** నీలా! తొందరగా యిటురా. ఈ పూలబుట్ట ఒకమారు పట్టుకో. ఇదిగో చామంతీగంధం, కస్తూరీలను నింపిన ఆ గిన్నెల నిక్కడ పెట్టు – ఒసే మల్లికా! ఉయ్యాలపై నించి వాలుగా జారేలా పూలదండల్ని నువ్వే అమర్చాలి సుమా! ఇదిగో వకుళా! ఆ పరు గులు మాని ఇలారా? ఈ పూలుమాలలుగా కూర్చే పని నీది. ఆ నల్లకలువ ప్రక్కన తెల్లసుగంధరాజం, ఆ వరుసనే ఇన్ని మరువ పుతునకలు, పక్కగా పసుపు సంపెంగలు అమర్చాలి సుమా! నీలాంబరాలూ, కనకాంబరాలూ మధ్య మధ్య అద్దినట్లుండాలి. ఆ కుందపుష్పాలూ, ముదురాకుపచ్చ సంపెంగలు గుమ్మాలకే మరి! గుత్తులుగా ఉన్న మాలతీలతలు అలంకారానికే అమరాలి! ఉయ్యాలచుట్టూమాత్రం లేత పరిమళాలు వెదజల్లే పూలే ఉండాలి. జాజిమొగ్గలూ, విరజాజులూ మెత్తగా పేర్చి, తెల్ల కలువరేకులతో శరత్కాలపుఆకాశమే అన్పించాలి. పసివాడు అటూ ఇటూ కదలినా, చేతులు కదిల్చినా మెత్తనిపూలే తగలాలి. పట్టుసెల్లా జరీ అంచు పూయలకి అందమివ్వాలే గాని పాపడికి ఒత్తుకోకూడదు. విరిసీవిరి యని పువ్వులు, పువ్వుల మధ్య మువ్వలూ గుచ్చు. గాలి తగిలితే తలలూచేలా సవరించి పెట్టు.

**ముదుసలిగోపెమ్మ:** అయ్యో! ఇంకామాలలే తయారు కాలేదా? అవునూ.... పొద్దుననగా వెళ్ళిన సన్నాయి మేలగాళ్లు మళ్లీ ఏవేళ కొస్తారో యేమో! అమ్మా యశోదమ్మా! ఒక్కసారి నందయ్యతో చెప్పమ్మా! వాళ్లకి కబురంపమని. పిల్లవాడికి హారతిచ్చే ముందే ముంగిట్లో మేళాలు మోగాలి మరి!

ఆ పెద్దలోగిలిలో రెండురకాల వూయలలు అలంకరింపబడ్డాయి– గొలుసుల బిల్ల ఉయ్యాల ఒకటి సాయం త్రపు వేడుకకీ, పట్టెతాళ్ల తొట్టి ఉయ్యాల ఒకటి, లాలిపాటల డోలలూ, ఆపేందుకూ. ఆ కాంక్షతోనే ఒక పూల ఋతువునే కుమ్మరించా రక్కడ. మేలిగంధాల్నే ఎంచి ఉంచారు.

ఉయ్యాల ఉయ్యాల ఉయ్యాల
ఊగాలి ఊగాలి ఉయ్యాల
గోపబాలుని తోడ ఉయ్యాల
రేపుమాపులు బాగ ఉయ్యాల ॥

ఎదురుతెన్నులు చూచి
ఎడద కన్నుల తెరచి
ఎంతగా తపియించి
ఇంత వేడుక చేయ ।

ఏనాటి వరమిది ఉయ్యాల
ఏ పుణ్య ఫలమిది ఉయ్యాల
రాగతాళాలతో ఉయ్యాల
గానవైభోగాల ఉయ్యాల ॥

**గోపికలు:** పొద్దు వాటారుతోంది. నల్లనయ్య బాగా అలసినట్లున్నాడు. ఆకలితోనూ ఉన్నట్లున్నాడు. ఏదీ ఆ వెండిగిన్నెలోని పాలు ఇటు ఇవ్వండి తాగితేనే గాని చల్లబడదు. ఊయల వూపితేనేగాని నిద్రకొరగడు.

ఊపరమ్మా ఊయల
ఊపరమ్మా నేడిలా
గోపాలబాలుని ఊయల
మురిపాల మువ్వల ఊయల ॥

వేల తపసుల చాల నోముల
ఫలములున్న ఊయల
వేదవేద్యుని కందరాని
వేడుకైన ఊయల ॥

వాలుకన్నుల దోరనవ్వుల
లేత తండ్రికి ఊయల
పాలకడలి తీరున
ఇల పూలు పరచిన ఊయల

**ముదుసలి గోపెమ్మ:** అవునుగాని యశోదమ్మా! రోజూ అన్నేసి పాటలతో లాలి వూయలలూపే నీవు ఈ రోజు కూడా ఒక పాట పాడవూ.. గంగ పొంగినట్లూ, మనసు పరచినట్లూ...

**యశోద**

ఉయ్యాల ఉయ్యాల ఉయ్యాల
ఊగరా నా తండ్రి ఉయ్యాల
జోలలే నే పాడ ఉయ్యాల
బాల గోపాలుడ ఉయ్యాల ॥

చిన్నిమబ్బు తునక చేరి నీపై వాలి
వెన్నెలల నెలరేడు పాల చెక్కిట చిక్కి
వాలుగాలి బాగ పూలతావిని విసర
మేలి గంధపు పొగల మేఘాలు ముసర ॥

తొల్లి నా పుణ్యాల చిరనోముల పంట
తల్లిగా నిను సాకి తరియింతు నంట
మది గీత మాలికల స్వరరాగ డోల
సేమముగ పవళించు నా చిన్ని కృష్ణా ॥

**ముదుసలి గోపెమ్మ:** యశోదమ్మా! నీ పాట విని లోకాలే నిదుర పోతాయేమో! అమ్మమనసంతా గుదిగుచ్చి నిలిపావు కదా నా తల్లీ! (ఎక్కడినించో వినిపిస్తున్న చక్కనైన ఓ కూనిరాగాన్ని విని) ఎవరే ఆ మూల నించి అలా కూని రాగం తీయకపోతే యిలా ఎదుటకొచ్చి పాడరాదా! అరే వకుళా! మంగలా! పరిమళా! రండే పిల్లల్లారా. పాడండే!

యశోదమ్మ ముద్దు శివువుకు
ఎదుటనున్న కలిమి పంటకు
ఎన్నివిధముల సేవలో
ఎన్నెన్ని రాగమాలలో॥



యశోదమ్మ ముద్దుశివువుకు
ఎదుటనున్న కల్పతరువుకు
ఎన్ని పూవుల వరుసలో
ఎన్నెన్ని మనసుల తపనలో ॥

పొద్దున భూపాలము
పొద్దు తిరిగి శ్రీరాగము
సంధ్యవేళకి మోహన
విందుగా హిందోళము ॥

లాలి పూయల లూగువేళ
లీలగా నీలాంబరి
పాలబువ్వల తీపి కథలకి
వాలుగా జోడౌను తోడి ॥

విందులతో, ఆటపాటలతో పొద్దుననించీ రాత్రి వరకూ జన్మదినం వేడుకలు సాగుతూనే ఉన్నాయి. ఆకాశంలో చుక్కలు పొడిచాయి. గువ్వలు గూళ్ళు చేరాయి. లేగలు కునుకు తీసాయి. పిల్లలు ఆకలికి మారాం చేస్తున్నారు.

చిన్నికృష్ణుడుకూడా అరకొర ఆకలితోనే నిద్ర కొరుగుతున్నాడు. కట్టబెట్టిన పట్టుజుబ్బా నలిగిపోయింది. పెట్టిన నెమలి పింఛం జారిపోయింది. దిద్దిన కస్తూరితిలకం రేగిపోయింది. అలంకరించిన ఆభరణాలు జారిపోతున్నాయి. రేగిన తల, మూగిన ముంగురులు ముఖాన్ని చికాకు పెడుతున్నాయి. నలిగి అలసి వాడిన నల్లనయ్య ఇపుడు అమ్మ ఒడిలో బజ్జున్నాడు. దిష్టి తీయ్యాలి. ఒక రక్ష పెట్టాలి!

రక్ష పెట్టరాదే ఈ లలితపల్లవ రాజకళలకు
దిష్టి తీయరారే నవనీతకోమల బాలశిశువుకు

మెలిక కురుల మోహనాంగునికి
మొలకనవ్వుల బాలజాబిలికి
చెలగు సొగసుల చిట్టి పాపనికి
ముదురు నీలపు మేఘబాలునికి ॥ రక్ష ॥

కరకు చూపులు తాకనీకుండ
అసురమూకలు చేర రాకుండ
ఎర్రర్రని నీరు తీసి
గుప్పమను సాంబ్రాణి వేసి ॥ రక్ష ॥

అందరూ: శ్రీరామరక్ష సర్వజగద్రక్ష



# పరమపావనక్షేత్రం
# శ్రీశైలం

రాష్ట్రంలోని కర్నూలు జిల్లాలోని నల్లమలకొండలలో వెలసిన సుప్రసిద్ధ ప్రాచీనక్షేత్రం శ్రీశైలం. ఈ క్షేత్రానికి సిద్ధవటం, త్రిపురాంతకం, అలంపురం, ఉమామహేశ్వరం- అనే నాలుగు ప్రవేశ ద్వారాలు, వైడూర్య, బ్రహ్మేశ్వర, మాణిక్య, ప్రవాళ, రౌప్య, హేమ, మరకత, వజ్రాలనే అష్టశిఖరాలు, అష్టభైరవులు, తొమ్మిది కదళీ వనాలు, నవనందులు, తొమ్మిది బిలాలు, తొమ్మిదిపురాలు, తొమ్మిదికూపాలు, తొమ్మండుగురు పీఠాధిపతులూ ఉన్నారు.

వేదాలలో, పురాణాలలో, చరిత్రలో వ్యావహారికగాథల్లో ఎంతో ప్రశస్తి కలిగి, సర్వతీర్థాల సమ్మిశ్రితమైన ఈ సిద్ధక్షేత్రం సాక్షాత్తు భూలోకకైలాసం. ఆధ్యాత్మికసంపన్నమైన ఈ వేదభూమిలో శ్రీశైలం అనన్యసామాన్యపుణ్యమండలం.

కాశీక్షేత్రంలో మరణం, అరుణాచలంలో భగవన్నామ స్మరణం, శ్రీశైలంలో లింగదర్శనం ముక్తిదాయకాలు.

శ్రీశైలశిఖరదర్శనమే సమస్తపాపహరణమూ, జన్మరాహిత్య వరము అని పురాణోక్తి. ఈ క్షేత్రంలోని మూలవిరాట్ శ్రీమల్లికార్జున స్వామి. దేవేరి శ్రీభ్రమరాంబ, అసంఖ్యాకతీర్థాలు, పుష్కరుణులు, ఓషధులు, తపోవనాలు సమస్తదేవతలు ఈ పునీతక్షేత్రానికి గల విశిష్టప్రత్యేకతలు. కృతయుగంలో హిరణ్యకశ్యపుడు, త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగంలో పాండవులు ఈ క్షేత్రాన్ని సందర్శించి, దేవదేవుడైన మల్లికార్జునుని, భ్రమరాంబ తల్లిని దర్శించి, అర్చించి, తమ పేర్లతో ఇక్కడ ఆలయాలు నిర్మించినట్లు పురాణాలద్వారా తెలుస్తూంది. సీతారామచంద్రులు, పాండవులు, ద్రౌపది ఈ క్షేత్రంలో సహస్రాదిశివలింగాలను ప్రతిష్ఠించినట్లు ప్రతీతి.

శ్రీశైలం మహత్తరయోగభూమి. ఇక్కడ నిర్మల చిత్తంతో సాధన చేసేవాళ్లకు అసాధ్యమైందీ ఉండదు. ఇచ్చటగల మూడు శ్రీగిరి శృంగాలు సామాన్యులకు గోచరించవు. అవి సాధకులకుమాత్రమే దర్శనీయాలు. ఈ క్షేత్రం అనంతకోటి లింగాలకు నెలవు. ఇన్ని శివలింగాలతో నెలకొన్న ఈ క్షేత్రం మల్లికార్జున భ్రమరాంబల అనురాగక్షేత్రం. నిఖిలదేవతాసమీకృతం, అఖండ మహిమాన్వితం, మహోత్కృష్టం- శ్రీశైలక్షేత్రం. పౌరాణిక ప్రాశస్త్యం గల ఈ క్షేత్రం చారిత్రాత్మకంగా కూడా ఎంతో ప్రసిద్ధిగల యాత్రాస్థలం.

# కృష్ణానదీ ప్రాశస్త్యం

- ఆచార్య ఎస్.గంగప్ప

**కృష్ణానదిలో కలిసే ఉపనదులు అనేకం. మహారాష్ట్రలోని వేణి, వరుణ, కొయినా, పంచగంగ, ఘటప్రభ, మలప్రభ, భామ, ఇంద్రాణి, తేల్, కౌశికి, వైష్ణవి, నారాయణి, మలాపహారిణి, భీమ మొదలైన ఉప నదులు కృష్ణలో కలుస్తాయి. కర్ణాటకలో తుంగ, భద్ర, శివుముఖి, వేత్రవతి, కుముద్వతి, ఇంద్ర, వరద, పంప, హగరి, హంద్రి అనే ఉపనదులు కృష్ణలో కలుస్తాయి. అలాగే మనరాష్ట్రంలో తుంగభద్ర, దిండి, మునియేరు, వైరా, మూసీ, అహల్య చంద్రవంక, నాగులేరు, పాతాళగంగలు కృష్ణలో కలసి కృష్ణానదిగా ప్రసిద్ధి.**



మహాబలేశ్వరం వద్ద ప్రారంభమై దివిసీమలో సాగరసంగమం చేసే కృష్ణానదితీరంలో అనేకతీర్థాలు, పుణ్యక్షేత్రాలు వెలసి మానవుల మనుగడకు ఎంతో పవిత్రతను చేకూరుస్తున్నాయి. కృష్ణానది పవిత్రతను, మహిమను ప్రశస్తిని వివరించే అనేకపౌరాణిక కథలున్నాయి. కృష్ణ పుట్టుకే ఒక విశిష్టమైంది. ద్వాపరయుగంలో మహాజ్వలప్రళయం సంభవించింది. నదీనదులు, పర్వతారణ్యాలు ఏకమై సముద్రంలో కలిసిపోయాయి. కృష్ణావతారం చాలించిన శ్రీమహావిష్ణువు వైకుంఠం చేరాడు. సృష్టిని పునఃప్రారంభించి బ్రహ్మ, విష్ణువును భూలోకంలో వదలిన కృష్ణాంశ ఒకనదిగా ఉన్న దానిని అనుగ్రహించమని కోరగా విష్ణువు అంగీకరించాడు. బ్రహ్మ కృష్ణను పుత్రికగా స్వీకరించి బ్రహ్మలోకంలో ఆమెను బ్రహ్మపుత్రిగా పిలువ నారంభించాడు.

కలియుగంలో బ్రహ్మ సృష్టి ఎక్కువైంది. దాంతో ప్రజలతో పాటు పాపాలు అధికమయ్యాయి. విష్ణువుని వేడుకుని భూలోకంలోని పాపాలను వివరించాడు. బ్రహ్మ వెంటనే విష్ణువు బ్రహ్మలోకంలోని కృష్ణను మానవుల పాపప్రక్షాళనార్థం భూలోకానికి వెళ్లమన్నాడు. బ్రహ్మ కృష్ణతో పాటు దేవగణ మానవగణసహితంగా భూలోకానికి తీసుకొనివచ్చాడు. సహ్యమునిని ప్రార్థించగా పర్వతరూపం ధరించాడు. తనమీదుగా ప్రవహించనమ్మని కృష్ణను కోరాడు. స్థిరనివాసానికిదే మూలమని భావించిన బ్రహ్మ, సహ్యాద్రిపై నుంచి కృష్ణ ప్రవహించేలా చేశాడు. సహ్యాద్రి తర్వాత వేదబ్రహ్మ గిరులకొనలలో 'శ్వేత- అశ్వత్థ వృక్షరూపం ధరించిన కృష్ణుడు కృష్ణను ప్రవహించమన్నాడు. కృష్ణ ఆ అశ్వత్థవృక్షం పాదాలు వ్రేళ్లనుంచి దూకుతూ ముందుకుసాగింది. సహ్యాద్రిని పావనంచేస్తూ పశ్చిమకనుమల లోయలనుంచి ప్రవహించనారంభించింది. కొంత దూరం వెళ్లాక శివాంశ అయిన వేణి ఆమలకవృక్షం మూలాలనుంచి పరుగిడుతూ వచ్చి తనను సైతం కలుపుకోమంది. అక్కడ కృష్ణవేణి సంగమంతో హరిహరుల ప్రియతీర్థాలై కృష్ణవేణిగా రూపొంది తూర్పుకనుమలవైపుగా ప్రవహించ నారంభించి, మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రలలో దూకుతూ దివిసీమలో సాగరసంగమం చేసి తన పవిత్రతను, ప్రశస్తిని చాటసాగింది.

కృష్ణవేణి ప్రయాణిస్తూ భైరవుని, నాగేశ్వరుని, శమనకుని యజ్ఞశాలను, పరశురాముని, నవబ్రహ్మలింగే శ్వరులను సేవించి ముందుకు సాగి శ్రీశైలం వద్ద ఆగిపోయింది.

భ్రమరాంబా మల్లికార్జునస్వామి ఆజ్ఞతో నల్లమల పర్వతశ్రేణులను పాతాళభాగంలో ఛేదించి బయలుదేరి, హిరణ్యకశిపుని సంహరించి నరసింహస్వామి పవిత్రీకరించిన భూమిని దాటి, హరిణావర్తక భూమిని పావనం చేసి, అమరేశ్వరుని సేవించి ఇంద్రకీలాద్రి వద్ద నిలిచింది. దుర్గా మల్లేశ్వరుల అనుజ్ఞతో ఇంద్రాద్రిని చీల్చుకొని శ్రీకాకుళేశ్వరుని సేవ చేసి రత్నగర్భ అయిన సాగరునితో సంగమించింది. ఇలా సాగిన ఈ నది కృష్ణుని పేరు వల్ల కృష్ణాంశమనీ, వేణి నామంచేత శంకరుని అంశమనీ, సహ్యముని వరంచేత సహ్యాద్రి నవతరించిందనీ, అందువల్లనే సహ్యాద్రిజ అనీ ప్రసిద్ధిగాంచిన కృష్ణవేణి పవిత్రత సార్థకమని తెలుస్తుంది. కృష్ణవేణిలో స్నానం చేస్తే సర్వపాపాలు తొలగిపోతాయి. అంతటి పవిత్రనది కృష్ణవేణి. పర్వతశిఖరాలలో పుట్టి కడలిలో కలిసిన నదులన్నింటిలోను ప్రప్రథమంగా పుట్టిననది కృష్ణానది. అందుకే అన్ని నదులకంటే ఈ కృష్ణకు పవిత్రత, మహిమ ఉందని తెలుస్తుంది.

మానవకోటికి యుగయుగాల నుంచి ఆధ్యాత్మిక, సాంస్కృతిక, జీవనస్రవంతికి ఆలవాలమైన ఈ పరమ పవిత్ర కృష్ణవేణి కలియుగంలో అందునా ఈ ఆధునిక యుగంలో మానవనాగరికతకు ఉపకరిస్తూ జీవనరీతికి ఉపకరిస్తూ వచ్చింది.

**బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించినప్పుడు కృష్ణానదీ పుష్కరాలు ప్రారంభమౌతాయి. ఆ పుష్కరసందర్భంలో కృష్ణానదిలో స్నానం చేసిన వారి పితృ, మాతృవంశాలవారు ఇరవైఒకతరాలవారు తరిస్తారు. ఇది కృష్ణవేణికున్న విశిష్టత.**

# తీరంలో...
# తియ్యందనం

కృష్ణమ్మ
ఎన్నెన్నోహొయలతో...
అలుపెరుగకుండా
మలుపులు తిరుగుతూ...
బిరబిరా నడిచినట్లు,
కృష్ణాతీరంలో....
పలుకుబళ్లను, మంచితనాలను,
మాటకారితనాలను-
సమపాళ్లలో రంగరించి అందించారు
మల్లాది రామకృష్ణశాస్త్రి.

వారు రాసిన కృష్ణాతీరంలో...
మామిడిపండు ఎక్కడ కొరికినా...
తియ్యదనాల పంటపండినట్లు-
ప్రతిపదం మన హృదయంపైన
కదంతొక్కుతుంది ఆస్వాదించండి
పుష్క(ల)రంగా....




'నాయనా, ఈ కథ ఇంకా ఎంత ఉంది!' అన్నాడు అన్నప్ప.

– 'ఇప్పుడే అంకురార్పణం అయింది. ముక్తసరిగా చెప్పుకుంటూపోయినా, మూడురోజులు పడుతుంది. అవునురా నాయనా! ఏ మల్లాచూస్తావ్! మన కళ్లెదట వాళ్లు ఒక చిన్న విషయం పట్టుకు, జీవిత మంతా సాగదీస్తూ ఉండటం చూస్తూ ఉండలా? చిలవలూ పలవలూ చేసి, చివుళ్లూపువ్వులూ జేర్చి, మాల అల్లు కుంటూపోతే, దానికి అంతేమిటి? వాగుడులో పడ్డామో, వంట పలాములై పోతుంది. అతిమంచివన్నా, ఓ హద్దంటూ ఉండాలి! అదిగో, చూశావా, అంతదూరం నుంచి అత్తవారితరపుమనిషి వస్తే, అన్నా నికి మొగం వాచేట్టుచేసి పంపిచాట్ట అని, అక్కడివాళ్లు– మధ్యను వీడిని ఆడిపోసుకుంటారు. మన చాదస్తం మనతో ఉండేదే కాని, మడిగట్టుకొచ్చి మంచిమాట చెయ్' అని, రాజమ్మగారు వాళ్లను తరిమితేనేకాని, అక్కడనుంచి కదలందే!

అప్పటికి, ఎంతసేపయో వెన్నెల వచ్చింది.

'అరుగుమీంచి లేచి, ఆరుబయటికి వచ్చేసరికి, ఆహాఁ! పెళ్లిపందిట్లోకి అడుగుపెట్టినట్టుంది. ఈ గాలి తిని బతకచ్చు!–' అనుకుంటూ పెళ్లినడకలు మొద లెట్టాడు; అన్నప్ప–

రామశేషు, ఆయనతోబాటే అడుగు నిదానించి వేస్తూ, 'ఆహాఁ! ఎంత కాలం దిన్నా తరగనిపంట! – ఎందరొచ్చినా, ఎవ్వరొచ్చినా అభ్యంతరం అంటూ ఉండదు.'

అన్నప్ప గొంతు, రవంత ఉలిక్కిపడ్డది – 'ఎవ్వరొచ్చినా– అంటే –'

'అంతే! మీరనుకున్నదే, నే నన్నదీ!'

ఆయన రామశేషు మొగంలోకి మొగం పెట్టి, 'నీ కడుపుచల్లగా...' అంటూండగానే, 'ఆఁ– ఆఁ మీవంటి యోగ్యులచేత అంతమాటపడే యోగం నాకు

లేదండోవ్!' అని, రామశేషు నవ్వుతూనే అన్నా, అన్నప్పకు, ఎందుచేతనో, ఆ ముక్క అలా, అతగాడి నోటివెంట రావడం మహాబాధగా అనిపించింది. ఒక్కక్షణం, అట్టె మనసు విల విల్లాడిపోయింది.

అమాంతం కావిలించుకునేంత ఆవేశంతో మీదిమీదికి పోబోయి అంతలో నీళ్లుకారిపోయి, మళ్లీ అట్టె నిలవదొక్కుకుని, 'నాయనా, ఎంతమాటన్నావ్ నా తండ్రీ! పనిగట్టుకొచ్చావ్– పరశురామక్షేత్రం ఫలసాయానికి దెచ్చావ్! పదిమందికీ సుష్ఠుగా అన్నోదకాలు కలిపించావ్! ఈ సుకృతం గాలికిపోతుందా? కను చూపు మేరదాకా, నీవు చేసినమేలు కనబడుతోనే ఉందిగా! నాలుగు చెంపలా పచ్చగా ఉంటే, నడుమ నిప్పచ్చరమౌతుందా! అబ్బాయ్! సీతమ్మతల్లి స్మరణే జీవితమైన వాణ్ణి, చిత్తశుద్ధిగా అంటున్నాను; నీవున్న చోట కొరతుండదు. వేయిజన్మలకైనా వెలితుండదు....'

రామశేషు, పకపకానవ్వుతూ; 'యింతా పొగడిందీ, ఇంకా వేయిజన్మలెత్త మనేందుకా? ఎత్తి, ఎవరి నుద్ధరించనండీ!'

'లోకాన్ని–'

'సరిపోయె!– నా ఒళ్లే నేనుమోయలేకుండా ఉంటే,–...'

'అంటే–'

'అదో సెమత్కారం లెగుండీ! బావిలో నీళ్లు సల్లారి పోతుండాయి, పదుండీ!–' అని సుబ్బన్న కలుగజేసుకున్నాడు; అంతవరకూ, వాడు వెంట వస్తూన్నది, – అన్నప్ప గమనించ లేదు; ఛెళ్లున ఆతడి వంకజూసి. – 'ఆఁహా ఆఁహా! అంగోస్త్రంలాగా, అహర్నిశలూ అంటిపట్టుకునే ఉంటావన్న మాట! ఎంతపుణ్యం జేసుకుంటేనో గాని, ఇలాంటి అంగరక్షకులు దొరకరు! పొరబాటున ఎన్నడన్నా కట్టుకున్నదన్నా, అంటే, కట్టుకున్న ధోవతన్నా తొలగుతుంది కాని, నువ్వు మాత్రం వైదొలగవు! మాకు తోడొచ్చావా నా తండ్రీ! ఏం? మేం, తోడిపోసి పోసుకోలేం?–'

'తోడీ పోసుకోలేరు, ఆడీ పోసుకోలేరు:'

ఇక్కడి నీళ్లూ, ఇక్కడివాళ్లూ వీళ్లది ఒక్కటే తరహాఁ– అవతలివారికి, అట్టి చేలోకువ అవడమంటూ లేదు:'





# సిరులిచ్చే... శ్రీలక్ష్మి!!

– శ్రీ జె. అనిల్‌కుమార్

**శ్రావణమాసంలో పున్నమికి ముందు వచ్చే శుక్రవారం సిరిసంపదలను కురిపించే శ్రీ వరలక్ష్మీవ్రతాన్ని ఆచరిస్తారు. నూతన వధువులు మాత్రమే గాక ఇంటిల్లిపాదీ శుభప్రదంగా జరుపుకునే వ్రతం శ్రీ వరలక్ష్మీవ్రతం!**

## వ్రతకథ

పరమశివుడు, పార్వతీదేవికి చెప్పిన కథ ఇది.

పూర్వం మగధదేశంలో ఉన్న కుండిననగరం పాడి పంటలకు, ధాన్యపురాశులకు, రత్నాలరాశులకు పుట్టినిల్లు. ఈ నగరంలోని ప్రతి లోగిలీ అష్టైశ్వర్యాలతో కళకళలాడుతూ శ్రీ మహాలక్ష్మి సన్ని ధానంలా దర్శనమిచ్చేది. ప్రతి ఇల్లాలూ సౌభాగ్య చిహ్నాలు ధరించి మహాలక్ష్మిగా దర్శనమిచ్చేది.

ఆ కుండిననగరంలో చారుమతి అనే బ్రాహ్మణస్త్రీ చుక్కల్లో చంద్రునిలాగా చక్కటి వర్చస్సుతో ప్రకాశిస్తూ ఉండేది. ఆ యువతి భర్తకూ, అత్తమామలకూ నిత్యమూ సపర్యలు చేస్తూ మంచి గృహిణి అన్న పేరు తెచ్చుకుంది. ప్రతిరోజు తెల్లవారు జామునే స్నానాదుల నాచరించి పుణ్యకార్యాలను నిర్వహించుకొంటున్న గుణవతి అయిన చారుమతికి ఒకనాడు కలలో శ్రీమహాలక్ష్మి ప్రత్యక్ష్యమైంది.

"ఓ చారుమతీ! సచ్ఛీలవతీ! పవిత్రమైన నీ నడతకు, పెద్దలకు వినయవినమ్రతతో నీవు చేస్తున్న సపర్యలకు చాలా సంతోషం కలి గింది. గృహలక్ష్మివైన నీ మీద నాకు అనుగ్రహం కలుగుతున్నది. నేను సకలవరాలను ఇట్టే అనుగ్రహించగల "వరలక్ష్మీదేవి"ని. అందువల్ల నేను ఆదేశించినట్లుగా నీవు **"వరలక్ష్మీ వ్రతం"** అనే వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో ఆచరించు. వచ్చే శ్రావణమాసంలో పున్నమి నాటికి ముందు వచ్చే శుక్రవారం నాడు ఈ వ్రతాన్ని నియమనిష్ఠ లతో నిర్వహించుకో" అంటూ లక్ష్మీదేవి కలలో ఉపదేశించింది.

చారుమతి ఆ కలలోనే తనకు ప్రత్యక్షమైన మహాలక్ష్మికి ప్రదక్షిణ నమస్కారాలను భక్తిపూర్వకంగా సమర్పించింది.

వెంటనే నిద్ర నుండి మేల్కొన్న చారుమతి భర్తకు, అత్త మామలకు తన దివ్య స్వప్నవృత్తాంతాన్ని, శ్రీ మహాలక్ష్మి ఆదేశాన్ని తెలియజేసింది. వారల అనుమతితో వరలక్ష్మీ వ్రతా చరణకు దీక్ష పూనింది. ఆ వ్రతానికి కావాల్సిన సంభారాలను, పూజాద్రవ్యాలను సమకూర్చుకొంది. ఇంతలో శ్రావణమాసం రానే వచ్చింది.

ఆగష్టు 12న

# శ్రీ వరలక్ష్మీవ్రతం

సందర్భంగా....



పున్నమినాటికి ముందు వచ్చే శుక్రవారం నాడు చారుమతి ఆమె స్నేహితురాండ్రు ఈ రోజే గదా **'వరలక్ష్మీ వ్రతం'** ఆచరించవలసిన రోజు అని అందరూ తెల్లవారుజామునే నిద్రలేచారు. అభ్యంగన స్నానాదులను పూర్తిచేసికొని రంగురంగుల పట్టుచీరలను ధరించారు. ఇలాగా పుణ్యస్త్రీలతో కూడిన చారుమతీదేవి తమ ఇంటిలో దేవుని మూలన అనగా ఈశాన్యభాగాన ఆవుపేడతో అలికి ముగ్గులు పెట్టింది. అచ్చోట ఒక మండపాన్ని ఏర్పాటుచేసింది. ఆ మండపంలో కొత్తబియ్యం పోసి అష్టదళపద్మంగా తీర్చిదిద్ది, ఆ బియ్యంపై నిండుగా జలాన్ని సేకరించిన కలశాన్ని, అందులో పంచపల్లవాలని పేరు పొందిన మర్రి, మామిడి, మేడి, జువ్వి, రావి చిగుళ్లను ఉంచింది. ఆ కలశంపై పూర్ణఫలమైన నారికేళాన్ని, దానిపై ఎర్రటి రవిక గుడ్డను అలంకరించింది. ఆ కలశం ముందు భాగంలో లక్ష్మీదేవి ముఖకవచాన్ని శోభాయమానంగా ఏర్పాటు చేసింది. ఆ కలశంలో విధివిధానంగా జగన్మాత అయిన శ్రీ వరలక్ష్మీదేవిని ఆవాహనం చేసింది.

శ్రీ వరలక్ష్మిని కీర్తిస్తూ చారుమతీదేవి, ఆవాహనం చేసిన వరలక్ష్మిని ధ్యాన ఆవాహ నాది షోడశోపచారాలతో, అష్టోత్తరశత నామాలతో అర్చించి అనేక విధాలైన భక్ష్యాలను, పిండివంటలను, ఫలాలను నైవేద్యంగా సమర్పించి, తొమ్మిది దారాలతో తయారు చేయబడిన తోరాన్ని అర్చించి, దాన్ని కుడిచేతికి కట్టుకుని భక్తిగా ప్రదక్షిణ, నమస్కారాలు సమర్పించింది.

మొదటి ప్రదక్షిణం చేసి నమస్కారం చెయ్యగానే చారుమతీ దేవికి, తోటి పుణ్యస్త్రీలకందరికి కాళ్లయందు ఘల్లుఘల్లున మ్రోగే గజ్జెలు కలిగాయి. ఇది గమనించిన చారుమతి, మిగిలిన స్త్రీలందరు, ఓహో! వరలక్ష్మీదేవి అనుగ్రహం వెనువెంటనే ప్రత్యక్షంగా గోచరించింది కదా అని ఆనందిస్తూ మిగిలిన రెండు, మూడు ప్రదక్షిణలు కూడా పూర్తి చేశారు. అంతే! చారుమతికే గాక అక్కడ వున్న స్త్రీలకందరికి శరీరమంతటా ఆపాదమస్తకం నవరత్నాలు పొదిగిన బంగారుహారాలు ఎన్నో ఎన్నెన్నో అలంకరింపబడడమే గాక ఆ స్త్రీలందరి ఇండ్లుకూడా సమస్తసంపదలతో తులతూగాయి. రథ గజ, తురగ వాహనాలతోవారి ఇండ్లు నిండిపోయాయి.

ఆ తర్వాత చారుమతి శాస్త్రోక్తంగా వరలక్ష్మీవ్రతాన్ని నిర్వహింపచేసిన పురోహితుణ్ణి చందన పుష్పాక్షతలతో అర్చించి దక్షిణ తాంబూలాలను సమర్పించి సంతృప్తిపరచింది. ఆ తరువాత అందరూ వరలక్ష్మీదేవి ప్రసాదాన్ని తృప్తిగా కడుపార భుజించి,

ఆహా! చారుమతీదేవి గొప్పదనమేమిటి? ఎంతటి సౌశీల్యవతి! ఆమె దయవల్లనే కదా మనకందరికి వరలక్ష్మీదేవి అనుగ్రహం కలిగింది అనుకుంటూ చారుమతి మహాభాగ్యాన్ని కొనియాడుతూ ఆమె అనుమతిని, ఆశీస్సులను స్వీకరించి వారి వారి ఇండ్లకు ఆనందంగా వెళ్ళారు.

ఇలాగ చారుమతీదేవి ద్వారా సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి లోకానికి అందించిన శ్రీ వరలక్ష్మీవ్రతాన్ని పార్వతీదేవికి పరమే శ్వరుడు తెలియజేశాడు.

**ఒకవేళ శ్రావణమాసంలో పున్నమినాటికి ముందువచ్చే శుక్రవారంనాడు వరలక్ష్మీవ్రతాన్ని ఆచరించడానికి వీలు కలగనివారు, అదే శ్రావణమాసంలో తర్వాత వచ్చే ఏ శుక్రవారమైనా వరలక్ష్మీవ్రతాన్ని చేసుకోవచ్చు. అప్పుడు కూడా ఏ కారణాల వల్లో, ఏ ఇబ్బందుల వల్లో శ్రావణమాసంలో వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించలేకపోయినవారు, ఆ వెనువెంటనే వచ్చే ఆశ్వయుజమాసంలో దేవీనవరాత్రుల్లో వరలక్ష్మీవ్రతాన్ని చెయ్యవచ్చని కొందరూ లేదా అమావాస్య దీపావళినాడైనా ఈ వ్రతాన్ని నిర్వహించవచ్చునని కొందరి పెద్దలమాట!**

ఏది ఏమైనా శ్రావణమాసంలో వీలుకాని సందర్భంలో మాత్రమే మహిమాన్వితమైన వరలక్ష్మీవ్రతాన్ని వదలిపెట్టకుండా గృహిణులు ఆశ్వయుజమాసంలో నిర్వహించడం ఎంతైనా మేలు అని సారాంశం!



# హంసలదీవి వేణుగోపాలుడు - శ్రీకాకుళాంధ్రదేవుడు

- డా॥ ముదివేడు ప్రభాకరరావు, 94418 72536

**కృష్ణవేణీనది మహారాష్ట్రలోని మహాబలేశ్వరపు కొండలలో పుట్టినచోటునుండి 1400 కిలోమీటర్ల దూరం ప్రయాణించి, కృష్ణాజిల్లాలో పులిగడ్డ దగ్గర రెండుపాయలుగా చీలుతుంది. ఎడమపాయ శివకేశవ క్షేత్రమైన "హంసలదీవి" దగ్గర సాగర సంగమం చేస్తుంది. కుడిపాయ మళ్లీ మూడుపాయలుగా చీలి, సముద్రంలో కలుస్తుంది. కృష్ణవేణీనది శివకేశవులకు ప్రతీకగా జన్మించింది. ప్రవహించినంతమేరకు శైవ-వైష్ణవ మతసామరస్యానికీ, దత్తాత్రేయ ఉపాసకులకు త్రిమూర్త్యాత్మక స్వరూపంగా దర్శన, మోక్షాదులను అనుగ్రహించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపిస్తున్నది. తత్త్వసమన్వయం చేస్తున్నది. భౌతికంగా మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రదేశాలను కలుపుతున్నది. ఇది బాహ్యసమన్వయం.**

## పేరుపెంపులు

హంసలదీవికి ఆ పేరెలా వచ్చిందో తెలియజేసే కథ ఒకటుంది. ఇద్దరు గంధర్వులు ఒకసారి ఆకాశవిహారం చేస్తూ, 'కృష్ణ' జన్మస్థానమైన సహ్యాద్రులపై తపస్సు చేసుకొంటున్న ఒక మహర్షియొక్క నల్లనిశరీరాన్ని చూచి, పరిహాసం చేశారు. దీనికి కోపించిన మహర్షి వారిద్దరినీ కాకులుగా జీవించండని శపించాడు. గంధర్వులు పశ్చాత్తాపంతో మహర్షి పాదాలపై బడి క్షమాపణలు చెప్పుకోగా, మహర్షి మనస్సు కరిగి, శాపనివారణం ఇలా చెప్పాడు.

కృష్ణానదికి గల అన్నితీర్థాలలో స్నానం చేస్తూ వెళ్లాలని, ఏదో ఒక తీర్థం దగ్గర కాకుల రూపంపోయి హంసల రూపం వస్తుందని చెప్పాడు. హంసలరూపం వచ్చాక, ఆకాశ గంగలో స్నానంచేస్తే గంధర్వరూపం వస్తుందని చెప్పాడు. కాకులుగా మారిన గంధర్వులు మహర్షి చెప్పినట్లే చేస్తూ, చివరికి ప్రస్తుతం 'హంసలదీవి'గా పిలువబడుతున్న కృష్ణాసాగరసంగమంలో స్నానం చేయగా-వారికి హంసలరూపం వచ్చింది. అప్పటినుండి ఆ ప్రాంతానికి హంసలదీవి అనే పేరేర్పడింది.

మరో కథనం ప్రకారం, ప్రతిరోజు రాత్రివేళ యోగీశ్వరులు హంసలరూపంలో వచ్చి, కృష్ణలోస్నానం చేసి, వేణుగోపాలస్వామిని అర్చిస్తారని, అందువల్ల హంసలదీవి అన్నారు. చారిత్రకపరంగా చూస్తే, తూర్పుచాళుక్య ప్రభువులు ప్రతిష్ఠించిన వేణుగోపాల విగ్రహం కాలగర్భంలో కలసిపోగా, ప్రస్తుతం కృష్ణవిగ్రహాన్ని పెట్టి పూజిస్తున్నారు. ప్రతిరోజు స్వామి విగ్రహానికి చందనపుపూత తప్పని సరిగా ఉంటుంది.

తెలుగులో అధిక్షేపశతకాలుగా పిలువబడే వ్యాజస్తుతి, వ్యాజనింద చేసిన శతకరచయితల్లో కాసుల పురుషోత్తమకవి అగ్రగణ్యుడు. ఇతడు శ్రీవేణుగోపాలుని పాదసేవకుడు. కృష్ణానదీ సీమలో తొలి అడుగుపెట్టిన శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువుపై, ఆంధ్రనాయక శతకాన్ని కృష్ణానది సాగరసంగమం చేసే పరమ పవిత్రమైన 'హంసలదీవి' క్షేత్రస్వామి వేణు గోపాలునిపై, రెండు శతకాలు వ్రాశారు. ఇవిగాక, మనసా! హరిపాదము లాశ్రయింపుమా!, రామా! భక్తకల్పద్రుమా! అనే మకుటాలుగల శతకాలు ఈయన రచించాడని చెబుతారు. కానీ వాటికి ఆధారాలు లేవు.

## హంసలదీవి ప్రశంస

హంసలదీవి క్షేత్రంలో వేణుగోపాల స్వామికి గోపురం ఏర్పడిన వృత్తాంతాన్ని కవి ఇలా వర్ణించారు.

సీ॥ ఎచ్చోట పూర్వవాహినిగ కృష్ణానది - సరసవీచీపరంపరల బొలుచు
నెచ్చోట లవణాబ్ధి హితతరంగములచే-దక్షిణ దిశను సందడులు సేయు
నెచ్చోట కంకణహేలాగతుల వేణి - పశ్చిమ తటమున బాయకుండు
నెచ్చోట భోగవతీగంగ బుద్బుదా - కృతుల నుత్తరదిశ నెగయుచుండు
నచ్చట వినోదగోపురంబమరె నీకు - భావజవిలాస! హంసలదీవివాస!
లలిత కృష్ణాబ్ధి సంగమ స్థలవిహార - పరమకరుణాస్వభావ గోపాలదేవ!!

(పద్యం-98)

"వేణుగానలోలా! గోపాలా!! తూర్పునకు ప్రవహించి ప్రకాశించే కృష్ణానది, దక్షిణంలో, సందడిచేసే లవణసముద్రం వేణీనదియొక్క కంకణ ధ్వనులు, పడమట మెరయగ, ఉత్తర దిశలో 'భోగవతి' అనేపేరుతో పిలువబడే 'పాతాళగంగ' బుడగలరూపంతో ఎగిసిపడే చోట 'హంసలదీవి' అనే పేరుగల క్షేత్రంలో 'గోపురం' ఏర్పడింది.

ఈ సీసపద్యం దాదాపు రెండువందల సంవత్సరాల క్రితం కవికాలంనాటి 'హంసలదీవి' భౌగోళికపరిస్థితులు తెలియజేస్తున్నాయి. కృష్ణవేణి విజయవాడను దాటి 40 మైళ్లు వెళ్లి 'పులిగడ్డ'ను చేరిన తర్వాత అక్కడనుండి మరో 15 మైళ్లు ప్రయాణించి పెదపులివర్రు దగ్గర రెండుపాయలుగా చీలి ఒకటి 'మోరోలు' దగ్గర, మరొకటి హంసలదీవి దగ్గర సముద్రంలో కలుస్తాయి. ఈ పాయల నడిమిభాగమే 'దివిసీమ'గా ప్రసిద్ధి పొందింది. చుట్టూ నీళ్లు-మధ్యలో భూభాగం ఉంది కాబట్టి 'దీవి' అయింది. కాలక్రమేణ దూరంగా జరిగాయి. 1977 నవంబరు 19వ తేదీ వచ్చిన భయంకరమైన ఉప్పెనలో శ్రీవేణుగోపాలస్వామి 300 మంది ఆర్తులైన భక్తుల్ని తన ఆలయంలో రక్షించి ఆర్తత్రాణపరాయణుడనే బిరుదును సార్థకం చేసుకొన్నాడు. సముద్రుడు స్వామివారి పాదాలను కడిగి వెనక్కు తిరిగాడు.

## హంసలదీవి వేణుగోపాలస్వామి ఆలయవిశేషాలు

వేణుగోపాలస్వామిఆలయం ఆగమశాస్త్రానుసారంగా కట్టబడింది. ఆగమోక్తప్రకారంగా ధ్రువబేరం నిర్మించబడింది. రెండువైపుల రుక్మిణీ సత్యభామలున్నారు. ఉపాలయంలో ఆసీన లక్ష్మీ నృసింహవిగ్రహం ఉంది. ఉత్తరదిశవైపు ఉపాలయంలో మహావిష్ణుమూర్తి ఉన్నాడు. దక్షిణాభిముఖంలో రాజ్యలక్ష్మీ అమ్మవారున్నారు. రెండుద్వారాలపైన గజలక్ష్మీ శిల్పంన్నది. ఇది ఐశ్వర్యానికి ప్రతీక! అమ్మవారి గర్భాలయ ద్వారానికి పూర్ణ కుంభరూపాలు చెక్కబడ్డాయి.

**పుష్కర మంటే**
**'పోషించేది' అని వ్యుత్పత్తి.**
**నీళ్లు అని అర్థం.**
**ప్రపంచమంతా భగవంతుని స్వరూపమే!**
**పంచభూతాలైన**
**భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము -**
**అనేవీ భగవంతుని రూపాలే!**
**వీటిలో దేని ప్రత్యేకత దానికున్నా -**
**జలానికి (నీళ్లకు) ఒక విశిష్టస్థానం ఉంది.**

వేణుగోపాలస్వామికి ప్రతియేటా మాఘమాసంలో బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. మూడవరోజు రథోత్సవం, నాల్గవ రోజు వసంతోత్సవం, ధ్వజావరోహణం చేసి, స్వామికి పవళింపు సేవ చేస్తారు.

ఈ ఆలయవిమానం పేరు 'విష్ణుక్రాంతము'. ఆలయ కుడ్యాలపై క్రోష్టాలలో గరుత్మంతుడు, లక్ష్మీనారాయణులు, నరసింహుడు, శైవ-వైష్ణవ మతాల సామరస్యానికి ప్రతీకగా దుర్గాదేవీ, వరసిద్ధివినాయక శిల్పాలున్నాయి. సముద్రవ్యాపారులు పూర్వం ఆంజనేయస్వామిని ఆరాధించేవారు. సముద్ర లంఘనం చేసిన హనుమకు రెండువిగ్రహాలున్నాయి.





శ్రీకాకుళాంధ్రదేవుడే ఆంధ్రనాయకుడు. దివిసీమ లోని తీర్థక్షేత్రంలో మొట్టమొదటిది శ్రీకాకుళం. సుచంద్రుని కుమారు డైన **'ఆంధ్రవిష్ణువు'** నిశుంభుని సంహరించగా ప్రజలు ఆయన మరణానంతరం గుడి కట్టారు. ఆంధ్రవిష్ణువు ఒకప్పుడు రాజు మాత్రమే! అతడిప్పుడు గుడిలో అర్చావతారమూర్తి. కాని, చారిత్రకులు శ్రీముఖశాతవాహనునిస్మృత్యర్థమే ఆంధ్రనాయక, ఆంధ్రమహావిష్ణువు, తెలుగురాయడనే పేర్లతో ఈ దేవాలయంలో మూలవిరాట్టుగ వెలసినాడని చెబుతున్నారు.



### శ్రీకాకుళఆంధ్రమహావిష్ణువు ఆలయవిశేషాలు

ఆంధ్రనాయకస్వామి గర్భగుడిమీది విమానానికి **భద్ర కోటి** విమానమనిపేరు. బాహ్యగర్భాలయం గోడలమీద వినాయ కుడు, మహిషాసురమర్ధని విగ్రహాలున్నాయి. రంగమండపంలో ఉత్తరాభిముఖంగా దక్షిణపు గోడలోని గూడులో భాగ్యలక్ష్మీ అమ్మ వారున్నారు. ఆగమశాస్త్రాలలో భాగ్యలక్ష్మీ ప్రస్తావనలున్నాయి. సౌభాగ్యలక్ష్మీస్తోత్రం సుప్రసిద్ధం.

చెన్నకేశవస్వామి ఆలయంలో వీరాసనంలో మీసాలున్న రామచంద్రమూర్తి విగ్రహముంది. ఇది సీతాసమేతంగా ఉంది. కాకతీయుల కాలంనాటి లక్ష్మీనృసింహవిగ్రహం, లక్ష్మీదేవి, ఆళ్వార్లవిగ్రహాలున్నాయి. శ్రీకాకుళంలో వెలసిన ఆంధ్రమహా విష్ణువుగుడిలోనే శ్రీకృష్ణదేవరాయలు ఏకాదశీ ఉపవాస ముండి ఆ రోజురాత్రి నాల్గవజామున స్వప్నం రాగా తెలుగువల్లభుని కోర్కెపై ఆముక్తమాల్యద ప్రబంధం వ్రాశాడు.

'అగ్నిహోత్రం' అనే యింటి పేరుగల వైఖానసులు శ్రీకా కుళంలో ఎక్కువ. గుడిలో 24 గంటలు ఆగమోక్తప్రకారంగా అగ్నిహోత్రం జ్వలిస్తూనే ఉంటుంది. ఈ గుడిలో పంచబేరాలకు బదులు రెండు ఉత్సవబేరాలున్నాయి. వైశాఖమాసం పున్నమి రోజు కల్యాణోత్సవం జరుగుతుంది. దీనినే **'దవనపున్నమి'** అని పిలుస్తారు.



### పుష్కరకాలంలో పిండప్రదానం చేయవలసినవారు (మరణించినవారికిమాత్రమే)

1) తండ్రి 2)తండ్రి తండ్రి 3)తండ్రి తాత 4) తల్లి, సవతి తల్లి 5)తండ్రి తల్లి 6)తండ్రికి తాతమ్మ 7)తల్లి తండ్రి 8)తల్లి తాత 9)తల్లి ముత్తాత 10)తల్లి తల్లి 11)తల్లి నాయనమ్మ 12)తల్లి నాయనమ్మకు అత్తగారు 13)భార్య 14)కుమారుడు 15)అన్నదమ్ములు 16)పినతండ్రి, పెదతండ్రి 17)మేనమామలు 18)కూతురు 19)అక్కాచెల్లెళ్లు 20)కూతురు, కొడుకు 21)మేనల్లుడు 22)తండ్రి అక్కాచెల్లెళ్ళు 23)తల్లి అక్కాచెల్లెళ్లు (పినతల్లి, పెదతల్లి) 24)అల్లుడు 25)బావ (తోబుట్టువుభర్త) 26)కోడలు 27)మామగారు 28)మేనమామ కొడుకులు, భార్య, అన్న దమ్ములు 29)గురువులు 30)ధనసహాయం చేసినవారు 31)దత్తుతీసుకొన్నవారు 32)పెంచి పోషించినవారు 33)ఆత్మీయులు(గోత్రం తెలీక పోతే పేరు చెప్పి, అయినా చేయ వచ్చు).





# పావన కృష్ణాతీరం- పరమగురువులు

- శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, 99856 70152

**ఎన్నో పుణ్యతీర్థాలచెంత, క్షేత్రాల్లో, ఆలయపరిసరాల్లో ప్రవహిస్తున్న కృష్ణానదిలో భక్తప్రజలు ఏడాది పొడవునా నదీస్నానం చేసినందు వల్ల, భక్తుల పాపాలు నదికి సంక్రమిస్తున్నాయి కదా! ఆ పాపాలు, దోషాలు, ఏమవుతాయి? ఎక్కడికి పోతాయి? ఆ కృష్ణమ్మ తాను స్వీకరించిన మానవులపాపాల్ని ఎలా పోగొట్టు కొంటుంది? అనే సందేహపరంపరకు సమాధానం ఈ వ్యాసం.**

కృష్ణానది భక్తులవల్ల తనకు సంక్రమించిన పాపాల నిర్మూలనంకోసం, యోగులను ఋషులను, అవధూతలను, జగద్గురువులను ఆశ్రయిస్తుందట! వారిని ఆహ్వానిస్తుందట! **ఆ మహాత్ముల స్పర్శవల్ల, స్నానంవల్ల, పానంవల్ల ఇట్టే క్షణ కాలంలో ఆ కలుషాలన్నీ మటుమాయం అవుతాయట!** అందువల్లే మహనీయుల రాకకోసం కృష్ణమ్మ నిరంతరం ఎదురు చూస్తుందట. అలా నిరంతరం ఎదురుచూడబడే సద్గురువు శ్రీదత్తాత్రేయస్వామివారు.

సహ్యాద్రిలో కృష్ణానదిజన్మస్థలంలో సంచరించే శ్రీ దత్తాత్రేయస్వామి 'పాతాళగంగ' అనబడే కృష్ణానదీతీరంలోని "శ్రీశైల క్షేత్రం"లో వేలాదిసంవత్సరాలు తపస్సు చేశారట! శ్రీశైలమల్లి కార్జునస్వామివారి ఆలయప్రాంగణంలోనే వృద్ధమల్లికార్జున స్వామిఆలయం పక్కనే దత్తాత్రేయస్వామి తపస్సుచేసిన స్థలాన్ని నేటికీ దర్శించవచ్చు. ఔదుంబరవృక్షంచుట్టూరా వున్న పెద్ద అరుగులాంటి తిన్నె. మేడిచెట్టు, జువ్విచెట్టు, రావిచెట్టు మూడు కలగలిపి పెనవేసుకొని పెరిగిన వృక్షపీఠం. దత్తాత్రేయస్వామి వారితపోపీఠంగా, ఈ వృక్షం దత్తాత్రేయవృక్షంగా, ఔదుంబర వృక్షంగా పిలువబడుతున్నది.

గురువులకు గురువైన శ్రీగురుదత్తుడు నేటికీ అటు కృష్ణానదినీ, ఇటు క్షేత్రాన్నీ పరమపవిత్రం చేస్తుంటారు. అలాగే ప్రతి రోజు మధ్యాహ్నం సమయంలో శ్రీదత్తాత్రేయస్వామి కృష్ణా తీరంలో వెలసిన శ్రీశక్తిపీఠం కొల్హాపురంక్షేత్రంలోని శ్రీమహాలక్ష్మి సన్నిధిలో భిక్ష తీసుకుంటాడట!

ఈ కలియుగంలోనే శ్రీ దత్తాత్రేయస్వామివారు శ్రీపాద శ్రీవల్లభుడిగా గోదావరితీరంలోని పీఠికాపురంలో (శక్తిపీఠం) అవతరించారు. శ్రీపాదులవారు శ్రీశైలంలోని పాతాళగంగలో అనుష్ఠానం చేసుకొంటూ-ఔదుంబరవృక్షం క్రింద నాలుగునెలలపాటు తపస్సు చేశారట! ఆ తరువాత కర్ణాటకరాష్ట్రంలోని కృష్ణానదీ తీరంలో "కురువపురం" అనే దివ్యస్థలాన్ని తన తపోభూమిగా చేసుకొని, అక్కడే అంతర్హితులయ్యారు. అదే 'కురుగాడి' లేదా "కురుగడ్డి". కృష్ణానదిలోని ఒక లంకప్రాంతం ఇది.

ఇక శ్రీగురుదత్తుని మూడవ అవతారమైన 'శ్రీనరసింహ సరస్వతిస్వామివారు' మహారాష్ట్రలోని కరంజనగరంలో అవతరించారు. ఈ స్వామివారు మహారాష్ట్రలోనే కృష్ణానదీతీరంలోని 'ఔదుంబర్' క్షేత్రంలోను, నరసోబావాడి (నరసింహవాడి) క్షేత్రంలోను చాలాకాలం తపస్సు చేశారు. కృష్ణాతీరంలోని ఈ రెండు క్షేత్రాలు, శ్రీదత్తాత్రేయస్వామి నిత్యం భిక్ష తీసుకొనే కొల్హాపురం క్షేత్రానికి దగ్గరలోనే ఉన్నాయి.

ఆ తర్వాత కర్ణాటకలోని 'గాణగాపురక్షేత్రం'లో శ్రీనరసింహసరస్వతిస్వామి చాలాకాలం ఉన్నారు. 'గాణగాపురం' కూడా కృష్ణాతీరంలో వెలసిన ప్రసిద్ధదత్తక్షేత్రం. కృష్ణాతీరంలోని ఈ క్షేత్రాలన్నింటిలోను, శ్రీనరసింహసరస్వతిస్వామివారి విమల పాదుకలు, నిర్మలపాదుకలు, నిర్గుణపాదకలపేరుతో శ్రీగురు దత్తుడు అర్చించబడుతూనే ఉంటాడు. శ్రీనరసింహసరస్వతి స్వామివారు శ్రీశైలక్షేత్రానికి వెళ్లి, పవిత్రకృష్ణానది (పాతాళ గంగ)లో "పూలపల్లకి"లాగా ఉన్న తెప్పలో వెళ్లుతూ అదృశ్యమయ్యారనీ, అక్కడికి దగ్గరలోని కదళీవనంలో ఇప్పటికీ ఉన్నారని ప్రసిద్ధి!

అనాదిగా మహనీయులైన అవధూతలు, పరమయోగులు ఎందరో కృష్ణాతీరప్రాంతాన్ని, ఆ తీర్థజలాల్ని పావనం చేస్తూ లోకకల్యాణంకోసం తమ తమ తపస్సుల్ని ధారపోస్తున్నారు. ఈ ఆగష్టు 14 నుండి కన్యారాశిలో సంచరిస్తున్న గురువును ఆరాధిస్తూ, పవిత్రకృష్ణానదీజలాలల్లో స్నాన, ధ్యానపానాదులను నిర్వహించుకుందాం. పునీతులమవుదాం.



# సెప్టెంబరు, 2016 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం:** గత 6,7 మాసాలుగా ఉండే అష్టమస్థానకుజ దోషప్రభావం నెలాఖరునుండి తొలగడంతో ధన లాభం, సంతోషం, మానసికస్థైర్యం కలుగుతుంది. వస్త్రభూషణాదిప్రాప్తి, ఆరోగ్యసౌఖ్యం కలుగుతుంది. గ్రహస్థితి క్రమంగా అనుకూలమవుతుంది. చేసే వృత్తివ్యాపారాలలో లాభం కలుగుతుంది. మూడు సంవత్సరాలుగా నిలబాటుగా ఉండే లావాదేవీలు ఒక కొలిక్కివస్తాయి.



**వృషభం:** విద్యావ్యాసంగాలలో పాల్గొనడం, సుఖం, సంతోషం, ఇష్టకార్యసిద్ధి, బహుమతులు గెలుచుకోవడం, మనోధైర్యం కలుగుతాయి. ధనలాభం. గ్రహస్థితి అనుకూలం. సంతానవిషయంగా ఆనందిస్తారు. విద్యార్థులు ఉన్నతవిద్యలకోసం, పరిశోధనలకు పునాదులు వేయగల్గుతారు.



**మిథునం :** సర్వశుభాలు కలుగుతాయి. బంధుమిత్ర జనులతో సంతోషాన్ని పంచుకోవడం. కార్యభారాన్ని మోసి, విజయవంతులవడం జరుగుతుంది. కుటుంబంలో శుభకార్యాచరణకు శ్రీకారం చుట్టారు. ధనధాన్యలాభాలు వస్తాయి. సంతానం వృద్ధిలోనికి వస్తారు. ఉద్యోగులకు ప్రమోషన్ లభించే అవకాశాలు ఉన్నాయి. విదేశీవిద్యకై చేసే ప్రయత్నాలు విద్యార్థులకు శ్రేయోదాయకం.



**కర్కాటకం :** వర్తకవ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. సజ్జనసహవాసం, భగవత్సంబంధ విషయాలపై ఆసక్తి, దేవతారాధనం, సక్రమమైన నడవడికతో ఉంటారు. దేహసౌఖ్యం, ద్రవ్యలాభం, సంతోషం కలుగుతుంది. గ్రహస్థితి ప్రథమార్ధం అనుకూలం. చేసే వృత్తివ్యాపారాలు అనుకూలిస్తాయి. కుటుంబసౌఖ్యం, నూతన మిత్రలాభం, సోదరుల సహాయసహకారాలు లభిస్తాయి. ద్వితీయార్ధం విశేషఅనుకూలం. కోర్టువ్యవహారాలలో జయం.



**సింహం :** జన్మరాశిలో రవిసంచారకాలం. కోపం, ఉద్రేకం, మాటతొందర, ఇతరుల్ని నిందించడం, నీచ కార్యాలు తలపెట్టడం జరుగుతాయి. ధనవ్యయం చేస్తారు. వృత్తివ్యాపారాలలో అభివృద్ధి, ధనలాభాలు కలుగుతాయి. కుటుంబసౌఖ్యం, బంధుమిత్రులతో విందువినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.



**కన్య:** వీరికి ధైర్యంవల్ల అదృష్టం కలసివస్తుంది. కుటుంబవృద్ధికి సహకారం లభిస్తుంది. ఉన్నతనిర్ణయాలతో ఆశించిన ఫలితాలు ఉంటాయి. ఇంజనీర్లకు విదేశీఅవకాశాలు వస్తాయి. వృత్తివ్యాపారాలలో విశేష లాభాలు కలుగుతాయి. నూతనవస్తువస్త్రసువర్ణాభరణయోగాలు కలుగుతాయి.



**తుల :** ఉద్యోగరీత్యా మార్పులు ఉంటాయి. జన్మ రాశిలో గురుసంచారం యోగదాయకం అయినా ఆరోగ్యవిషయాలలో జాగ్రత్త, నిద్రలేమి, తలనరాల కండరాల నొప్పి, ఉదరసంబంధ స్వల్పఅనారోగ్య సూచనలు. గ్రంథపఠనం చేస్తూ ఆధ్యాత్మికంగా ఎదుగుతారు. గ్రహస్థితి అనుకూలం. వృత్తివ్యాపారాలలో అనుకూలత, ఆర్థిక లాభాలు కలుగుతాయి.



**వృశ్చికం :** వీరికి ఈ మాసంలో లాభస్థానంలో నీచోచ్చగ్రహాలు ఉండడంతో ఆర్థికంగా లాభిస్తుంది. అయినా జన్మరాశిలో శనిసంచారంవల్ల ఏదోఒక అనర్థం ఉంటూనే ఉంటుంది. ఆర్థికవిషయాలలో జాగ్రత్త అవసరం. ఈ మాసంనుండి ఈరాశివారికి గురుడు లాభాస్థానసంచారంతో అనుకూలత ఏర్పడుతుంది. ఏలినాటిశని ప్రభావంవల్ల కల్గే చిక్కులు, సమస్యలు కొంతవరకు పరిష్కారం అవుతాయి.



**ధనుస్సు :** ఈ రాశివారికి ఉద్యోగఉన్నతి. వృత్తి వ్యాపారాలలో లాభం కలుగుతుంది. సమాజంలో గుర్తింపు వస్తుంది. వీరు చేసే ధార్మికకార్యక్రమాలు పదిమందినీ ఆకర్షిస్తాయి. మార్కెటింగ్ ఉద్యోగులకు అనుకూలం. నూతనవస్తు, వస్త్రలాభాలు కలుగుతాయి.



**మకరం :** ఈ రాశివారికి కొంత ఆరోగ్యలాభం. గురుబలంవల్ల సౌఖ్యం లభిస్తుంది. సంతానం యొక్క అభివృద్ధికి సంబంధించిన అనేక శుభపరిణామాలు మిమ్ముల్ని ఆనందపరుస్తాయి. మీకు అదృష్టం కలసి వస్తుంది, ధనలాభం కలుగుతుంది. వృత్తివ్యాపారాలలో క్రమక్రమంగా అభివృద్ధి, ధనలాభం చేకూర్తుంది. స్థిరచరాస్తుల కొనుగోలుకు తండ్రిపక్షంవారి సహాయసహకారాలు లభిస్తాయి.



**కుంభం :** ఈ రాశివారికి గ్రహస్థితి మిక్కిలి ప్రతికూలం. వృత్తివ్యాపారాలలో అనుకూలత లేక ఆర్థికసమస్యలు ఎదురవుతాయి. ద్వితీయార్ధంలో కష్టనష్టాలు సంభవిస్తాయి. అధికారులతో సంప్రదిపులు జరుపుతూ సత్సంబంధాలు కొనసాగిస్తారు. శ్వాసకోశవ్యవస్థకు సంబంధించిన పరీక్షలు, చికిత్సపొందడం జరుగుతుంది. అయినా ఇబ్బంది లేదు. ప్రమాదం ఉండదు.



**మీనం :** ఈరాశివారికి గ్రహస్థితి మిక్కిలి అనుకూలం. ధనవ్యయం అయినా చేతినిండా ధనముంటుంది. వస్త్ర, ధన, ధాన్యాలు చేకూర్తాయి. పై అధికారుల దర్శనం ఇష్టకార్యసిద్ధి, శుక్రుడు అష్టమస్థానగతుడు కావడంతో గొప్పసౌఖ్యం, బంధుమిత్రులతో కలయిక ఉంటుంది. కల్యాణాదిశుభకార్యాలు కలసి వస్తాయి.

## అడ్డం

**2)** 'ఆముక్తమాల్యద' లోని ఒక ఉపాఖ్యానంలో ప్రధానపాత్ర (5)

**5)** శరీరభాగాలు రెంటినీ సంధించిన రక్కసి (2)

**7)** సూర్యసుతుడు (2)

**8)** భక్తి (3)

**9)** శంఖం (2)

**12)** కకావికలయినకర్షకుడు (4)

**13)** నిజం మాట్లాడండి, దేవభాషలో (4)

**15)** తామ్రం (2)

**16)** ఉపవాసాలు (3)

**17)** మిక్కిలి (2)

**19)** చెట్టు అటునుంచి ఇటు జరిగింది (2)

**20)** సంహారం (2)

**21)** వృద్ధాప్యం (2)

**నిర్వహణ**

**బి.వి.ఎస్.ఎస్.సుబ్రహ్మణ్యం**

జవాబులు
ఈ సంచికలోనే ఉన్నాయి.

అన్వేషించి....
సరిచూసుకోండి.

- ప్రధాన సంపాదకుడు

09







## నిలువు

**1)** రాత్రి (3)

**3)** ఈ రేయి ఈశ్వరునికి పరమప్రీతికరం (4)

**4)** సేన తలక్రిందులుగా (2)

**6)** విష్ణుమూర్తి (6)

**7)** ఆశ్వయుజంలో వచ్చే తొమ్మిదిరాత్రుల పండుగ (6)

**10)** రహదారి (3)

**11)** అవసరం చెల్లాచెదరయింది (3)

**14)** విష్ణువక్షఃస్థలాన మణి (4)

**17)** వినతసవతి (3)

**18)** కథ (2)

ఈ కూపను కత్తిరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రం

**1. పేరు మరియు చిరునామా :**
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

(పిన్‌కోడ్ తప్పని సరి)

సెల్ నెం.

**2. కావలసిన భాష :** ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు ☐ సంస్కృతం సంవత్సరచందా మాత్రమే

**3. సంవత్సర/జీవిత చందా :** ☐ రూ. 60/- ☐ రూ. 500/-

**4. చందా పునరుద్ధరణ :**
(అ) చందా నెంబరు : (ఆ) భాష :

**5. చెల్లించిన మొత్తం :**
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :
తేది : చందాదారుని సంతకం

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ.ను **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారిపేరున తీయాలి.
- సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామానుమాత్రమే సంప్రదించండి. **తి.తి.దే. ప్రధానసంపాదకకార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.**
- మనిఆర్డరు పంపేవారు - అందులోనే మీచందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.
- మా చిరునామా **"ప్రధానసంపాదకుడు, సప్తగిరికార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".**

ఇతర వివరాలకు ఫోన్ నెం. **0877-2264543**

## శ్రీవారి సేవ విచారణ ప్రశ్నావళి

**01) శ్రీవారిసేవకు ఎలా నమోదు చేసుకోవాలి?**

**జ.** తమ తోటి యాత్రీకులకు ఉచితంగా సేవలందించదలచినవారు ఈ క్రింది చిరునామాకు వివరాలు పంపగలరు. ప్రజాసంబంధాధికారి, తి.తి.దే., కె.టి.రోడ్డు, తిరుపతి. ఫోన్: 0877-2264217 / 4392

**02) శ్రీవారిసేవ చేయడానికి మాకు వయో పరిమితి ఏమిటి?**

**జ.** 18 ఏళ్ల వయస్సు నుండి 60 ఏళ్ల వయస్సు వరకు.

**03) పరకామణి మరియు లడ్డు ప్రసాద సేవలు చేయడానికి దరఖాస్తు ఎవరికి పంపాలి?**

**జ.** ఈ విశేషసేవలలో పాల్గొనదల్చిన భక్తులు ఆన్‌లైన్‌లో వివరాలు పంపాలి. పరకామణి కొరకు పబ్లిక్‌సెక్టార్ యూనిట్స్‌లో పదవుల్లో ఉన్నవారైనా, లేక విశ్రాంత ఉద్యోగస్థులైనా అర్జీ పంపవచ్చు. లడ్డు ప్రసాదం లేక నేషనలైజ్డ్ బ్యాంకు సేవకు కూడా ఈ పద్ధతే వర్తిస్తుంది. కానీ, ఈ మధ్యకాలంలో, నిర్వహణాధికారులు లడ్డుసేవ సంబంధిత విషయంలో కొంతమార్పు తీసుకొచ్చారు. ఇప్పుడు, కొంతైనా కంప్యూటర్ పనితీరు సంబంధిత అవగాహన ఉన్న 20 నుంచి 45 మధ్య వయస్సు గల ఆఫ్‌లైన్‌లో అర్జీలు పెట్టుకోవచ్చు.

**04) శ్రీవారిసేవలో ఎన్నిరోజులు పాటు చేయాలి?**

**జ.** సామాన్యంగా శ్రీవారిసేవ ఏడు రోజులపాటు చేసి ఎనిమిదవనాడు స్వామివారి దర్శనం చేసుకోవాలి. పరకామణి-3 లేదా 4 రోజులు, లడ్డు ప్రసాదంసేవ-4 లేదా 5 రోజులు.


Edited and published on behalf of T.T.Devasthanams by Dr. K.Radha Ramana, M.A., M.Phil., Ph.D., Chief Editor(FAC), T.T.D. and printed at T.T.D. Press by Smt M.Gowthami, M.B.A., Dy. E.O.,(Publications & Press), T.T.D, Manager, T.T.D., Press, Tirupati - 517 507.

## 02-08-2016
## శ్రీ చక్రత్తాళ్వార్ జయంతి



తిర్యగ్జ్వాలాగ్నిరూపం జ్వలితశిఖిశిఖోత్తుంగ కేయూరబాహుం
పింగాక్షం దీప్తజిహ్వ దశశతవిలస తీక్ష్ణధారాతిరౌద్రమ్ ।
శార్ఙ్గం చక్రాబ్జశంఖాన్ శరముసలధరం సర్వశత్రూన్ దహంతం
షట్కోణాభ్యంతరస్థం రవినియుతనిభం చక్రరాజం నమామి ॥



SAPTHAGIRI (TELUGU) ILLUSTRATED MONTHLY Published by Tirumala Tirupati Devasthanams 25-07-2016
Regd. with the Registrar of Newspapers under "RNI" No.10742, Postal Regd.No.TRP/10 - 2015-2017
Licensed to post without prepayment No.PMGK/RNP-/DLGS/SAPTHAGIRI-Dt 18-12-2014

కోరకనే అమ్మ యశోదమ్మకు
వరాలిచ్చిన కృష్ణమ్మ
కోరినంత పాడిపంటలిచ్చే కృష్ణమ్మ
అన్నియు నీవే హరిపుండరీకాక్ష

25-08-2016
శ్రీ కృష్ణజయంతి

SIVAPRASAD

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 25-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 7-50 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 7-50 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 7-50 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 10-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 20-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 20-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 20-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 20-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 20-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 20-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 20-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 30-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | స్త్రీలపాటలు (కామేశ్వరీపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 20-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | ధన్వంతరీ వ్రతకల్పం | 10-00 |
| 28. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |
| 29. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 30. | శ్రీ చక్రపూజ | 10-00 |
| 31. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 32. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 33. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | వెల రూ. 10-00 |
| 34. | శ్రీలలితానిత్యపూజ(లలితాసహస్రనామస్తోత్రంతో) | 10-00 |
| 35. | శ్రీ గాయత్రీ నిత్యపూజ | 10-00 |
| 36. | అన్నపూర్ణ నిత్యపూజ | 10-00 |
| 37. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 38. | మహిషాసుర మర్ధనీపూజ | 10-00 |
| 39. | రాజరాజేశ్వరీ నిత్యపూజ | 10-00 |
| 40. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 41. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 42. | శివపూజ | 10-00 |
| 43. | వీరభద్ర పూజ | 10-00 |
| 44. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 45. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 46. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 47. | రామదేవుని కథ | 10-00 |
| 48. | శివదేవుని కథ | 10-00 |
| 49. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 50. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 51. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 52. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 53. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 54. | రుక్మిణీ కల్యాణం | 20-00 |
| 55. | ఉమామహేశ్వర వ్రతం | 20-00 |
| 56. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 20-00 |
| 57. | 16 సోమవారముల వ్రతము | 20-00 |
| 58. | పార్వతీకల్యాణం | 20-00 |
| 59. | సహస్రకమలవర్తి వ్రతము | 20-00 |
| 60. | పంచముఖ ఆంజనేయనిత్యపూజ | 20-00 |
| 61. | అష్టనాగపూజ | 36-00 |
| 62. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 63. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 64. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 65. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 66. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 67. | హనుమద్ వ్రతం | 36-00 |

68. పంచాయతన పూజ వెల రూ. 45-00
69. 28 వ్రతములు 108-00
70. కలశపూజలు (9ఒకేసారి) 150-00
71. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) 150-00
72. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) 150-00
73. అర్చన 40-00
74. శ్రీరామ కర్ణామృతము 99-00
75. శ్రీ దేవీ భాగవతం 99-00
76. శ్రీ దేవీ భాగవతం (కేస్‌బైండ్) 360-00
77. క్షేత్రనామార్చన 63-00

**2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు**

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 40-00
2. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు(కేస్‌బైండ్) 63-00
3. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు (పత్రికసైజ్ కేస్ బైండ్) 108-00

పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం

4. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ),,40-00
5. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు,,40-00
6. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
7. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 20-00
8. లలితా సహస్రనామ స్తోత్రమ్(క్రౌన్) 36-00
9. లలితా సహస్రనామములు 20-00
10. లక్ష్మీ సహస్రనామములు 20-00
11. దుర్గా సహస్రనామములు 20-00
12. ఆంజనేయ సహస్రనామములు 20-00
13. శివ సహస్రనామములు 20-00
14. విష్ణు సహస్రనామములు 20-00
15. గణపతి సహస్రనామములు 20-00
16. సుబ్రహ్మణ్య సహస్రనామములు 20-00
18. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 20-00
19. శ్రీరామా సహస్రనామములు 20-00
20. లక్ష్మీనృసింహసహస్రనామములు 20-00
21. సూర్యసహస్రనామములు& ఆదిత్యహృదయం 20-00
22. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 20-00
23. మణిద్వీపవర్ణన (పెద్దది) 20-00
24. సంధ్యావందనం 20-00
25. మంత్రపుష్పమ్ 20-00
26. త్రిభాషా హనుమాన్‌చాలీసా 10-00
27. హనుమాన్ చాలీసా వెల రూ. 9-00
28. మణిద్వీపవర్ణన (పాకెట్) 10-00
29. ఆరు చాలీసాలు 10-00
30. శివారాధన (శివస్తోత్రాలు) 10-00
31. వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) 10-00
32. ఆరుదండకాలు 6-00
33. వేంకటేశ్వర గోవిందనామములు 6-00
34. అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ 10-00
35. దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) 10-00
36. బాలాత్రిపుర సుందరీ నిత్యపూజ 10-00
37. సుందరకాండ (పాకెట్) 10-00
38. భగవద్గీత మూలం 20-00
39. రామరక్షాస్తోత్రమ్ 15-00
40. స్తోత్ర రత్నావళి 36-00
41. పురాణపండలలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) 10-00
42. పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ)10-00
43. పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ 10-00
44. పురాణపండ ఆదిత్య హృదయం 10-00
45. మంత్రపుష్పం (మినీ) 10-00
46. శివానందలహరి-సౌందర్యలహరి 36-00
47. కుజదోషం 10-00
48. కాలసర్ప దోషం 10-00
49. మీ అప్పులు తీరాలా? 10-00
50. దృష్టిదోషాలు నివారణ 10-00
51. సర్వదేవతా ధ్యానశ్లోకములు 10-00
52. పంచసూక్తములు 10-00
53. సంధ్యావందనం 10-00
54. రుద్రనమకమ్-చమకమ్ 10-00
55. గాయత్రీమంత్రాలు 10-00
56. జపమంత్రాలు 10-00
57. హయగ్రీవ స్తోత్రమాల 10-00
58. దక్షిణామూర్తి స్తోత్రమాల 10-00
59. ద్వాదశ జ్యోతిర్లింగాలు-పంచారామాలతో 10-00
60. శ్రీసూక్తం పురుష సూక్తం 10-00
61. నవదుర్గలు 10-00
62. నవగ్రహస్తోత్రమాల 36-00

| | |
|---|---|
| 63. మహాన్యాసమ్ వెల రూ. | 36-00 |
| 64. సుందరకాండ గానామృతం | 36-00 |
| 65. సంధ్యా వందనం (పెద్దది) | 36-00 |
| 66. గోమాతపూజావిధానము | 10-00 |
| 67. ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |
| 68. ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు -ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 69. నిత్యదేవతార్చన | 45-00 |
| 70. శ్రీలలితా సహస్రనామములు -విపులవివరణసహితం | 144-00 |
| 71. శ్రీ దుర్గాసప్తశతి-(చండీ) హోమవిధానము | .... |
| 72. సర్వదేవతా స్తోత్రనిధి | 99-00 |
| 73. మణిద్వీపము (విపుల వచన వ్యాఖ్యానము) | 99-00 |
| 74. కాలభైరవ రక్షాకవచము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | |
|---|---|
| 1. శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 99-00 |
| 2. సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 99-00 |
| 3. శ్రీ సాయిఆరాధన-షిర్డీవైభవం | 99-00 |
| 4. శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 54-00 |
| 5. శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 54-00 |
| 6. దాసగణకృత శ్రీసాయి చరిత్ర | 36-00 |
| 7. నవనాధ చరిత్ర | 99-00 |
| 8. శ్రీసాయిచరిత్ర(బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 54-00 |
| 9. శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 54-00 |
| 10. సత్యదత్తవ్రతం -దత్తాత్రేయపూజాకల్పం, సహస్రంతో | 20-00 |
| 11. అనఘాదేవీ వ్రతం | 20-00 |
| 12. భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 13. మనసులోనిప్రశ్నకుశ్రీసాయిబాబాజవాబులు | 30-00 |
| 14. అక్షరక్రమములో శ్రీసాయిసూక్తులు | 30-00 |
| 15. శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 20-00 |
| 16. శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 17. శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 18. శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 19. శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 20. "శ్రీసాయి"కోటి | 25-00 |
| 21. "శ్రీసాయిరామ్"కోటి వెల రూ. | 20-00 |
| 22. శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 23. శ్రీ సాయివేయినామాలు | 3-50 |
| 24. శ్రీ సాయి సహస్ర నామావళి | 10-00 |
| 25. శ్రీ సాయి చాలీసా-సుప్రభాతం | 10-00 |
| 26. శ్రీ సాయినాధ చాలీసా | 10-00 |
| 27. శ్రీ సాయి హారతులు (పాకెట్) | 10-00 |
| 28. శ్రీ సాయి నిత్యపూజ (పాకెట్) | 10-00 |
| 29. శ్రీ సాయి సూక్తులు | 10-00 |
| 30. శ్రీ సాయి స్తవనమంజరి-దత్తచాలీసా | 10-00 |
| 31. శ్రీసాయి నక్షత్రమాలిక | 10-00 |
| 32. హిందీ శ్రీ సాయి హారతులు | 12-00 |
| 33. శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 45-00 |
| 34. ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 12-00 |
| 35. షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 36. సాయిసత్యవ్రతం | 20-00 |
| 37. సాయి అనుగ్రహమ్ | 108-00 |
| 38. నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 39. శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 40. హృదయంలో సాయి | 12-00 |
| 41. శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 99-00 |
| 42. గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 60-00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 116-00 |
| 3. శ్రీచక్ర పంచాంగం (తొలి మహిళాపంచాంగం) | 45-00 |
| 4. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 60-00 |
| 5. ములుగువారిరాశిఫలితాలు(12రాశులువారికి) | 40-00 |
| 6. ములుగువారిరాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 10-00 |
| 7. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ -(శ్రీనివాసగార్గేయ-ప్రణతిటివి) | 25-00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25-00 |
| 9. సాదా క్యాలండర్ | 5-00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15-00 |
| 11. తాజక నీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 150-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 150-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 150-00 |

| | | |
|---|---|---|
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి వెల రూ. | 150-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 250-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 45-00 |
| 23. | సర్వార్థ ఫలచంద్రిక | 99-00 |
| 24. | సూర్యసిద్ధాంత పంచాంగగణితంచేయడంఎలా? | 150-00 |
| 25. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 150-00 |
| 26. | ఆయుర్దాయ నిర్ణయం | 45-00 |
| 27. | జాతక గణిత ప్రవేశిక | 50-00 |
| 28. | జ్యోతిషమర్మబోధిని | 50-00 |
| 29. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 50-00 |
| 30. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 50-00 |
| 31. | జాతక మకరందం | 36-00 |
| 32. | జ్యోతిష సరస్వతి | 36-00 |
| 33. | మీజననకాల విశేషాలు | 36-00 |
| 34. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 36-00 |
| 35. | జ్యోతిష స్వయంబోధిని | 36-00 |
| 36. | శుభముహూర్త శిరోమణి | 36-00 |
| 37. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 38. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 39. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 40. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 41. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 42. | శుభశకునాలు | 25-00 |
| 43. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 44. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 45. | ముహూర్త దీపిక | 99-00 |
| 46. | పుట్టుమచ్చలు ఫలితాలు | 25-00 |
| 47. | కలలు ఫలితాలు | 25-00 |
| 48. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 49. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 50. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 108-00 |
| 51. | గుప్తా శతాబ్ధి పంచాంగం(1940-2050) | 999-00 |
| 52. | ప్రశ్నచండేశ్వరమ్ వెల రూ. | 50-00 |
| 53. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 54. | జాతకచక్రం మీరే వేసుకోవచ్చు | 36-00 |
| 55. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 108-00 |
| 56. | అంగసాముద్రికం | 36-00 |
| 57. | హస్త సాముద్రికం | 40-00 |
| 58. | లాల్ కితాబ్ | 99-00 |
| 59. | శకునశాస్త్రం | 80-00 |
| 60. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 61. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 150-00 |
| 62. | అష్టకవర్గు | 50-00 |
| 63. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 200-00 |
| 64. | లగ్నరత్నాకరం | 45-00 |
| 65. | షట్పంచాశిక | 120-00 |
| 66. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 67. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 150-00 |
| 68. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 150-00 |
| 69. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 70. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 71. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు | 270-00 |
| | న్యూమరాలాజీ సూపర్ గైడ్ | 200-00 |
| 72. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 50-00 |
| 73. | ముహూర్తచింతామణి | 99-00 |
| 74. | సూర్యచంద్ర గ్రహణములు | 50-00 |
| 75. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 150-00 |
| 76. | అదృష్టరెమెడీస్ | 120-00 |
| 77. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 50-00 |
| 78. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 79. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం(కొండపల్లి) | 250-00 |
| 80. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం(కొండపల్లి) | 250-00 |
| 81. | నాడీజ్యోతిషం | 50-00 |
| 82. | గార్గేయం మీ గ్రహబలం రెమిడీస్ | 250-00 |
| 83. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 50-00 |
| 84. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 50-00 |
| 85. | గౌతమసంహిత | 50-00 |

86. హోరరత్నమాల వెల రూ. 50-00
87. జాతకఫల మణిమంజరి 200-00
88. పుష్కర పంచాంగం 540-00
89. దశాభుక్తిఫల నిర్ణయం 250-00
90. వింత జోష్యములు 50-00
91. షోడశవర్గులు 200-00
92-105.రవి/చంద్ర/కుజ/బుధ/గురు/శుక్ర/శని/రాహుకేతు
-నవగ్రహములకు ఒక్కొక్క పుస్తకం 99-00
93. ముహూర్తమార్తాండం 50-00
94. లఘుజాతకం 50-00
95. జాతకాలంకారము 50-00
99-107. మేషాది మీనం-12 లగ్నాలు
ఒక్కొక్క లగ్నం గ్రంథం 99-00
108. నారద సంహిత 200-00
109. పంచాంగపీఠికలేఖికాగణితం 250-00
110. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) 99-00
111. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) 200-00
112. రమలశాస్త్రం 108-00
113. ముహూర్త రత్నావళి 250-00

బి.వి.రామన్ గారి గ్రంథములు

114. జ్యోతిష విద్యారంభం 50-00
115. గ్రహభావ బలములు 50-00
116. కాలచక్రదశ 50-00
117. అనుభవ ప్రశ్నాజ్యోతిషం 50-00
118. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు 50-00
119. పురోగామి జాతకం 50-00
120. భావార్ధరత్నాకరం 75-00
121. భారతీయజ్యోతిష సర్వస్వం 75-00
122. అష్టకవర్గ పద్ధతిః 75-00
123. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు 75-00
124. ప్రశ్నతంత్ర 75-00
125. ముహూర్తం 75-00
126. విశిష్ట జాతకములు 125-00
127. భారతీయఫలితజ్యోతిషం 125-00
128. 300 ముఖ్యమైన యోగములు 125-00
129. జాతకంపరిశీలించడంఎలా ? 300-00

రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి
**శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు** వెల రూ.

130. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-1 200-00
131. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-2 200-00
132. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-3 200-00
133. బృహత్‌పరాశరహోరాశాస్త్రము-4 200-00
134. భావార్థరత్నాకరము 100-00
135. ముహూర్త చింతామణి 100-00
136. ముహూర్త చింతామణి-పార్టు2 200-00
137. స్వప్న శాస్త్రము 50-00
138. శతయోగమంజరి 33-00
139. వ్రతనిర్ణయకల్పవల్లి 165-00
140. దైవజ్ఞవల్లభం 75-00
141. వసంతరాజశకునమ్ (ఎం.ఆర్.వి.శర్మ) 250-00
142. ఉపాసనా విధానము (ఎం.ఆర్.వి.శర్మ) 99-00
143. వాస్తుశాస్త్రవివేకము-1 50-00
144. వాస్తుశాస్త్రవివేకము-2 200-00
145. వాస్తుశాస్త్రవివేకము-3 50-00
146. వాస్తుశాస్త్రవివేకము-4 200-00
147. అనుభవసులభవాస్తు - 1 50-00
148. అనుభవసులభవాస్తు - 2 100-00

## 5. వాస్తులు

1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి 180-00
2. వాస్తుశాస్త్ర రహస్యములు (బైండు) 108-00
3. వాస్తునుబట్టి మీ ఇల్లు 54-00
4. మీరూ మీ వాస్తు 54-00
5. గృహవాస్తు చిట్కాలు 54-00
6. వాస్తు పూజ 54-00
7. వాస్తు సూత్రములు 54-00
8. వాస్తుశాస్త్ర రహస్యాలు 54-00
9. గృహవాస్తు వర్గులు 99-00
10. విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు 50-00
11. విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు 99-00
12. విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) 180-00
13. ఆధునిక గృహవాస్తు 99-00
14. శుభవాస్తు 270-00
15. వాస్తుయంత్ర రత్నావళి 108-00
16. వాస్తుశాస్త్రం 120-00

| | |
|---|---|
| 17. హౌస్ ప్లాన్లు వెల రూ. | 50-00 |
| 18. గృహవాస్తుసారం | 50-00 |
| 19. గృహవాస్తు చంద్రిక | 50-00 |
| 20. గృహవాస్తు దర్పణం | 50-00 |
| 21. జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 50-00 |
| 22. వాస్తురత్నాకరం (కొండపల్లి) | 50-00 |
| 23. వాస్తుశిరోమణి ,, | 50-00 |
| 24. శ్రీకృష్ణవాస్తు ,, | 50-00 |
| 25. పంచవాస్తు పారిజాతం ,, | 108-00 |
| 26. వాస్తుడిండిమమ్ ,, | 50-00 |
| 27. వాస్తుదుందిభి ,, | 108-00 |
| 28. విశ్వకర్మవాస్తుప్రకాశిక | 99-00 |
| 29. కృష్ణవాస్తుశాస్త్రము | 50-00 |
| 30. జలవాస్తు,శల్యవాస్తు(దంతూరిపండరీనాథ్) | 75-00 |
| 31. మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. వాస్తుజ్యోతి | 54-00 |
| 33. వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | |
|---|---|
| 1. మంత్రసాధన | 54-00 |
| 2. తంత్రజాలం | 54-00 |
| 3. మంత్రశక్తి | 54-00 |
| 4. దత్తాత్రేయ తంత్రవిద్య | 54-00 |
| 5. దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 54-00 |
| 6. తాంత్రిక పంచాంగం | 54-00 |
| 7. యక్షిణీ తంత్రం | 54-00 |
| 8. మంత్రానుష్ఠాన చంద్రిక | 54-00 |
| 9. సర్వదేవతా మంత్రకవచములు | 54-00 |
| 10. మంత్రాక్షరాలరహస్యం(బీజాక్షరనిఘంటువు) | 54-00 |
| 11. సర్వదేవతా మంత్రరత్నావళి | 54-00 |
| 12. సదాచార దీపిక | 54-00 |
| 13. యోగినీ-వామకేశ్వరతంత్రం | 54-00 |
| 14. ప్రపంచసారతంత్రం | 54-00 |
| 15. బదనిక తంత్రమ్ | 54-00 |
| 16. ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 54-00 |
| 17. గుప్త సాధన తంత్రం | 54-00 |
| 18. గంధర్వ తంత్రమ్ | 54-00 |
| 19. సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 54-00 |
| 20. యంత్ర మంత్ర తంత్ర | 54-00 |
| 21. పాశుపత తంత్రం వెల రూ. | 99-00 |
| 22. పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. మంత్రసిద్ధి | 108-00 |
| 25. పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. శూలినీదుర్గాతంత్రం (చిన్నది) | 100-00 |
| 30. మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 31. శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 32. మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 33. సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 34. హవన తంత్రం | 250-00 |
| 35. షోడశనిత్యతంత్రం | 250-00 |
| 36. శాక్తేయతంత్రం | 250-00 |
| 37. రుద్రయామళతంత్రం | 250-00 |
| 38. లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 39. హిరణ్యాశూలినీ తంత్రమ్ | 250-00 |
| 40. మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 42. స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 43. కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 44. శాంతితంత్రమ్ | 250-00 |
| 45. యంత్రసిద్ధి | 360-00 |
| 46. శ్రీ లక్ష్మీ తంత్రమ్ | 360-00 |
| 47. మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 49. మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 50. ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 51. కామధేనువు తంత్రం | 360-00 |
| 52. శూలినీదుర్గాతంత్రం | 360-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | |
|---|---|
| 1. భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. గణేశోపాసన 2 | 99-00 |
| 4. నవగ్రహవైభవం | 99-00 |
| 5. నవగ్రహ రెమెడీస్ | 99-00 |

